# గుడ్డిలోకం

(సాంఘిక నాటకం)

రచన:

డాక్టర్ కొల్లిపాటి గంగాధరరావు

బాపట్ల



ప్రచురణ

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# తొలిపలుకు

నేటి సంఘజీవనంలో ప్రతీదీ ఒకసమస్యగా పరిణమిస్తున్నది. ఎక్కడచూసినా ఒక రాజకీయసమస్య, ఒక సాంఘిక సమస్య, ఒక సంసారికసమస్య- ఇవన్నీ యిలావుంచి తెల్సుకోవాలేగాని ప్రతి ఒక్కడూ ప్రతివక్కడికీ ఒక్కొక్క సమస్య అయిపోగలడు. పరాయివాడి యింటిమీద ఒకడు ప్రతిరోజూ ఒక రాయి విసిరితే ఆ పరాయివాడికి యీ ఒక్కడూ ఒకసమస్య అయిపోగలడు. పరాయివాడికి ఒక సమస్య తేగలగటం మనలో ప్రతివొకడూ తేలికగా చేయగల పనుల్లో ఒకటి. అది గుర్తించి మనం పెద్ద పెద్ద సమస్యలను నివారించలేకపోయినా - మన దినచర్య మరొకరికి సమస్య తెచ్చిపెట్టకుండా ప్రవర్తించుకుంటే చాలా పెద్ద సమస్యలను నివారించినంత గొప్పపని జరుగుతుంది. దాని కంటె పరాయివాడితో సహకరించి, సానుభూతి చూపి, వీలైతే సహాయంచేస్తే వ్యక్తి[illegible] చాలానివారణ అవుతాయి. ప్రతివారూ యిది గ్రహించి ప్రవర్తిస్తే చాలా సంఘ చైతన్యం కలిగినట్లే.

కాని, యిదే గ్రహించదు యీలోకం. పైగాసంఘపు వరవడి ఏమాత్రం తప్పినా వారిని విగ్రోహులుగా జమకట్టి శిక్షిస్తుంది ప్రపంచం. సమస్య సంస్కరించబడి పదిమందీ

దాన్నే ఆరంభించేవరకూ యీ సంస్కర్తలు సంఘవిద్రో హులు, ఏఒక్కడూ పూనలేనంత కఠినత్వంతో యీసంస్కర్తలను ఉమ్మడిగా యీసంఘం బాధిస్తుంది. ఈసంఘంలో ప్రతిఒక్కడూ మంచివాడే - న్యాయాన్యాయాలు తెల్సిన వాడే, కాని వుమ్మడిగా సంఘం వేయితలల రాక్షసి. కాని ఒక్కతలా వుపయోగించదు.

ఈ రాక్షసికి ఎదురు తిరిగి నిలిచేవారికంటె భయపడి తప్పుకునేవారే ఎక్కువ వుంటారు. అలాంటివాడే వెంకట్రామయ్య. సంఘమంటే భయపడ్తూ ఏపని చెయ్యాలన్నా 'లోకం ఏమనుకుంటుందో' అనే ఆలోచిస్తాడు. తాను లోకం కోసమే జీవిస్తాడు. లోకపు వరవడిలోనే నడుస్తాడు. ఆ అమాయకుణ్ణి రాచి రంపాన పెడ్తుంది యీ లోకం. తన పాటి వాడుగా అతన్ని గుర్తించదు. తనకెందుకని వూరుకోదు. అతన్ని సరిదిద్దపోతుంది. అతనికి జరిగిన అన్యాయాన్ని విస్మరిస్తుంది - కనక "గుడ్డిలోకం" అది. అంతగా తనంటే భయపడ్తూన్న లోకమే చివరికి బ్రతికుండగనే బయటపెట్టమంటూంది - కనుక "గుడ్డిలోకమే" అది.

ఈనాటకం నిజోద్దేశ్యం యీ మాదిరి లోకప్రవర్తనను ఎత్తిచూపించడమే. కనకనే మూడవ రంగాంతంలో వెంకట్రామయ్య కుటుంబం ప్రపంచాన్ని చూసి నవ్వినప్పటికీ కూడా నాటకం సమాప్తంకాలేదు. "ప్రపంచాన్ని చూసి నవ్వగలం. ఎదురు తిరగగలం గాని ప్రపంచాన్ని విస్మరించి

జీవించ గలమా'' అనే సందేహం వెంకట్రామయ్యలో వుండి పోయింది. ఇది ఒక నిత్యసందేహం. నాల్గవ సీనులో జానకి భర్తనే వెనకేసుకొస్తుంది. ప్రపంచం బ్రతికుండగనే బయట పెట్టమంటూాంది వెంకట్రామయ్యను. యిదే సంఘపు మామూలునడక. మనుష్యులందరి మన స్తత్వం యిదే. కొందరు వెంకట్రామయ్యలు, కొందరు వీరభద్రయ్య. సోమశేఖరంలు. కనక వీరెవ్వరికీ మరణం లేదు. వీరందరూ మారి ప్రసాములైననాడు ఈ నాటకం రచనాప్రయోజనం సిద్ధించిందనవచ్చు.

ఈ నాటకం వ్రాసి శ్రీరాఘవ కళాసమితికి చాలా సంవత్సరాలక్రింద యిచ్చాను. చాలా కష్టపడి ప్రదర్శించి, అనేకచోట్ల అభినందనాలందారు. రచయితగా నన్ను వెలుగులోకి తెచ్చారు. అందుకు వారికి నా కృతజ్ఞతలు. ఈనాటకం ప్రదర్శన హక్కులన్నీ వారికే యిచ్చి కృతజ్ఞత చూపుకుంటున్నాను.

ఇది రెండవ ముద్రణ. మొదటి ముద్రణ రాఘవకళా సమితి రాజమండ్రి వారే చేశారు. 55 తర్వాత అనేక పట్టణాల్లో గ్రామాలలో ఈ నాటకం ప్రదర్శించారు. వారందరికీ నా కృతజ్ఞత

కె. గంగాధరరావు.

ఈ నాటకం—శ్రీ రాఘవ కళాసమితిచే మొదటిసారి ది 11-4-53 తేదీన రాజమహేంద్రవరం వీరేశలింగా స్తికోన్నతపాఠశాల ఆవరణలో ప్రదర్శింపబడింది.

*

ది 17-11-53 తేదీన విజయనగరం శ్రీ రాఘవ స్మారక దినోత్సవ సభల నాటకపోటీలలో ప్రదర్శింపబడి - ఉత్తమ ప్రదర్శనంగా "రాఘవ షీల్డు"న్నూ వెంకట్రామయ్య పాత్రధారికి ఉత్తమ నటుడుగా ప్రథమ బహుమానం రజితపాత్ర యున్నూ, ఏడుకొండలు పాత్రధారికి ప్రత్యేక బహుమానం రజితపాత్రయున్నూ పొందినది.

*

ది 9-5-54 తేదీన. బందరు 18 వ ఆంధ్ర నాటక కళా పరిషత్ సమావేశాలలో ప్రదర్శింపబడి - ప్రదర్శనకు ద్వితీయ బహుమానమున్నూ - వెంకట్రామయ్య పాత్రధారికి ఉత్తమ నటుని బహుమానమున్నూ పొందియున్నది.

*

పై ప్రదర్శనల్లోని నటవర్గం :—

| | | | |
|---|---|---|---|
| వెంకట్రామయ్య | ... | ... | శ్రీ అంకరాజు శంకర్రావు |
| సోమశేఖరం | ... | ... | శ్రీ మేడూరి వీరవెంకన్న |
| వీరభద్రయ్య | ... | ... | శ్రీ వేములూరి నాగేంద్రాజి |
| ఏడుకొండలు | ... | ... | శ్రీ శ్రీపాద పట్టాభి |
| ప్రసాద్ | ... | ... | శ్రీ పువ్వాడ నరసింహమూర్తి |
| జానకి | ... | ... | శ్రీమతి కె. వి. శాంతాదేవి |

—*—

# రంగస్థలంపై కావలసిన పరికరాలు

Stage Properties -

1. నవ్వారు మంచం 2. పరుపు - దిండ్లు - దుప్పటి 3. పాతకుర్చి 4. స్టూలు 5. చిన్న టేబిల్ 6. బుక్ షెల్ఫు 7. పాగావంకీల బల్ల 8. పీకిదాన 9. వ్యాపారి బిందె 10. రాగిచెంబు-రాగి పంపపాత్ర 11. తాటాకు విసనకర్ర 1 . మందుసీసాలు రెండు 13. కొబ్బరిబొండాం, అరటిపళ్ళు ఆకులు, చెక్కలు, పసుపు, కుంకుమ 14. గాంధిపటం 15. యిబ్సన్ పటం 16. వీరేశలింగం పటం 17. మీరా బాయ్ పటం 18. వెంకట్రామయ్య భార్య ఫోటోగా ఏదైనా ముత్తయిదువ పటం.

Hand Properties :

1. 18 రూపాయ నోట్లు 4. అర్ధరూపాయ కాసులు (వెంకట్రామయ్య) 2. రెండురూపాయలు, మరి కొంతచిల్లర (ప్రసాద్‌కి) 3. ఒక రూపాయి (coin) (ఏడుకొండలికి) 4. సూటుకేస్ 1 5. కాలేజిపుస్తలు 6. కొన్ని మస్తులు (ప్రసాద్‌కి) 7. చిఠాపుస్తకాలు 2 8. చేతికర్ర (వెంకట్రామయ్యకి) 9. ఒక ట్రంకుపెట్టె-10. తువ్వాలు 11. కొత్త చీర, రవికలగుడ్డ 12. అద్దం, దువ్వెన, కుంకుమబరిణె (జానికికి) 13. ఒక వుత్తరం 14. లేత మెట్టవంకాయ (ఏడు కొండలికి)

# పాత్రల పరిచయం

వెంకట్రామయ్య - రిటైరైన సామాన్యఉద్యోగి, 60 సం॥లు
ప్రసాద్ - వెంకట్రామయ్య కొడుకు,
విద్యార్థి. 18 సం॥లు
జానకి - వెంకట్రామయ్య కుమార్తె, 16 సం॥లు
వీరభద్రయ్య - వెంకట్రామయ్య అద్దెకుంటున్న
యింటి స్వంతదారు, 50 సం॥లు
సోమశేఖరం - పొరుగింటాయన. 55 సం॥లు
ఏడుకొండలరావు - వెంకట్రామయ్యఅన్నకొడుకు, 20 సం॥లు

రంగాలు :— నాలుగు.

స్థలం :— వెంకట్రామయ్య అద్దెకుంటున్న
యింటిముందు చావడి.



# గుడ్డిలోకం

## మొదటి రంగం

[ఒక బీదసంసారి పడీ చావడి. పాతకుర్చీ, స్టూలు, నవారుమంచం, పాత పెట్టెలు, ఒక చిన్న టేబిల్, పుస్తకాల షెల్ఫు వగైరా సామాను.

గోడకు గాంధి, మీరాబాయ్, ఇబసన్ పటాలతో మరికొన్ని పటాలు—బట్టలు తగిలించుకునే కొయ్యస్టాండు, అద్దం, దువ్వెన వగైరా.

ఉన్నదాంట్లోనే సుభ్రత. అందంకోసం ప్రయత్నం కనిపిస్తూ వుంటుంది.

తెర లేచిన తర్వాత లోపల్నుంచి ప్రసాదు కొన్ని బట్టలమడతలతో ప్రవేశించి సూటుకేసులో సర్దుకుంటూ వుండగా—జానకి అప్పుడే స్నానంచేసి తువాలుతో తల తుడుచుకుంటూ వచ్చి—దువ్వెనతీసుకొని గోడనువున్న అద్దంలో చూచుకుంటూ—జుట్టు దువ్వుకుంటూ—కూనిరాగం తీస్తూ—ఆగి]

జానకి: అన్నయ్యా—నాన్న యింకా రాలేదే?

ప్రసా: వస్తూవుంటారమ్మా యీ పాటికి. నువ్వు త్వరగా కానియ్.

జానకి: (తల దువ్వుకుని బొట్టుపెట్టుకుంటూ) నువ్వు కాలేజీకి యెప్పుడు వెళతావ్?

ప్రసా: సాయంత్రం అయిదుగంటల బండికి.

జానకి: (వీధిలోనికి చూచి) అదుగో నాన్న వస్తున్నారు.

[వెంకట్రామయ్య వచ్చి చేతిసంచి జానకికి అందిచ్చి, కోటు, కండువా వంకెకు తగిలించి, జేబులోని పాతపర్సుతీసి దాంట్లోని నోట్లుతీసి లెఖ్ఖపెడుతూ నవ్వుకొని]

వెంక: ఎన్నిసార్లు లెక్కబెడితేమాత్రం రూపాయ లెక్కువవుతాయా ?

జానకి: ఏమిటి నాన్నా ! ఏం అన్నావ్ ?

వెంక: ఏమీ లేదు. పెన్షను తీసుకువచ్చాను – యిరవై రూపాయలు మిగిలాయి.

ప్రసా: యిరవయ్యా! మిగతావి వెచ్చాలకొట్లో యిచ్చారా?

వెంక: నే నివ్వలేదు. షాపువాడే గేటు దగ్గర కాపుకాసి దెబ్బలాడాడు. ఎలాగూ ముప్పయిరూపాయల బాకీ తీర్చవలసిందేగదా అని యిచ్చేశాను. మిగిలాయి యీ యిరవైరూపాయలు. హుఁ ఇరవైరూపాయలు. ఆ–ప్రసాదూ! నువ్వు ఎల్లుండి వెళ్ళకూడదూ కాలేజీకి.

ప్రసా: (పెట్టెలో పెట్టబోతున్న బట్టలమడతలు పెట్టకండా) అల్లాగే వెళ్ళవచ్చు. ఎప్పుడయితే ఏం ? (బట్టలు క్రింద పడేశాడు.)

వెంక: అదికాదురా ! అదికాదురా ! అమ్మాయి వచ్చింది కదూ ? ఏదో ఒక చీరన్నా పెట్టద్దూ.

జానకి: నాకు చీరకేం మునిగిపోయిందిలే నాన్నా. ఆ యిరవై యిచ్చి వాణ్ణి కాలేజికి పంపండి. యిప్పటికే పదిరోజు లాలశ్యమయిపోయింది. యింకా ఆలశ్యమయితే వాడికి రోజులు చాలవు.

వెంక: నిజమే. కాని యింటికివచ్చిన ఆడబడుచుకు ఒక సాదాచీరన్నా పెట్టకపోతే లోకులు ఏమనుకుంటారు.

ప్రసా: లోకులు సంగతలావుంచు. ముందు వీరా అత్తగారు. ఆడబిడ్డ నిమ్మాపిరి తీయనిస్తారా ?

జాన : అందుకని మరి తాహతుకుమించి మర్యాదటం దేనికి ? కాసేపు సణుగుకుంటే సణుక్కుంటారు. పరి నాలేదు గా!

వెంక: అంతొద్దులే అనితే బాగాలేదు. నువ్వా అదృష్ట సంపాదాలనద్యోదానివి ... అయ్యో పాపం.

ప్రసా: నాకు రెండు రోజులాలస్యమయితే అయిందిలేనాన్నా! దానికి చీర రవికలగుడ్డ కొనియివ్వండి.

వెంక: సరే. కొంటామనుకో. మరి రెండురోజులు తర్వాత మాత్రం నీకు డబ్బు కావద్దూ! అప్పుడెల్లా ?

ప్రసా: కాని ... ఏదో చూద్దాం.

జానకి: ఏం చేస్తారూ! ఎక్కడ జూస్తారు. అప్పుజేసి తెస్తే మాత్రం పైనెల్లో తీరొచ్చేద్దూ ? మళ్ళీ అప్పుడూ యీ యిబ్బందేగా! ఎందుకు వచ్చిందిది? నేనేదో

సమాధానం చెప్పుకుంటూ లే. అంతగా అయితే ఒక రవికలగుడ్డ కొను సరిపోతుంది.

వెంక: ఊఁ! కానియ్యవమ్మా! యీయిరవై రూపాయలతో వాడి చదువు వెళ్ళిపోతుందట.

[ఏసుకొండలరావు వస్తాడు. యిరవై వెళ్ళవాడు—కాస్త మోకాలికి కట్టు—చేతిలో ప్రశ్న పత్రినంకాయ తూఫ్పుగా]

ఏసు : బాబాయ్! బాబాయ్! లేతవంకాయలొచ్చాయ్! పాకె పడనాలట. యియ్యి బాబాయి కొందాం.

[వెంకట్రామయ్య వినిపించుకోడు.]

జానకి: యీ చీరతో వాళ్ళు సంతృప్తిపడి ఊరుకుంటారు కనకనా, మీరెప్పటికీగాని, ఆలోచిస్తూ అంతే. యిటు మీరా డబ్బు నష్టం అటు వాళ్ళకి తృప్తి వుండదు.

ఏసు : ఏమిటీ మీరాలోచించేది ?

ప్రసా: ఆ డబ్బిలా యివ్వండి. నేను కొనుక్కొ వస్తాను.

జానకి: (అడ్డొస్తూ) చెబితే వినరా అన్నయ్యా!

ప్రసా: నువ్వూరుకో జానకీ! నీకు తెలియదు. మా నాన్న మయినంతవరకూ ఏలోటూ లేకుండా వెయ్యాలిగా! తర్వాత మా తింటాలు వుండనే వున్నాయ్. నువ్వ యినా మీ అత్తవారింట్లో కాంట సుఖంగా వుంటే అంటే చాలు.

వెంక: మరే! మరే! తీసుకో. పది హేను రూపాయల్లో చీర తీసుకో; యీ రూపాయిన్నరలో రవికలగుడ్డ తీసుకో.

ఏడు : పదిహేను రూపాయల చీరే?

[వెంకట్రామయ్య నిర్లక్ష్యంగా చూస్తాడు.]

జానక: మరే - పది రూపాయల్లో తీసుకుంటే చాలునాన్నా!

వెంక: పది రూపాయల్లో నల్ఫై యేళ్ళ నంబరుదన్నా రాదమ్మా.

ప్రసా: మంచిదే కొందాం లెద్దూ! కాస్తలో లోపించడం దేనికి? మంచిది పెట్టలేదని మీ అత్తగారు సాధించటానికా?

వెంక: మరే మరే పోయిరా త్వరగా. (ప్రసాద్ వెళుతుండగా) ప్రసాద్! మర్చిపోయాను ఒకకొబ్బరిబొండాం అరటిపళ్ళు.

ప్రసా: అలాగే నాన్నా! (అంటూ బయటకు వెళ్తాడు.)

ఏడు : మరి వంకాయల సంగతి ఏమిటి బాబాయ్? ఆ మనిషి యింకా వున్నట్టుంది.

[వెంకట్రామయ్య మరికొంచెం తీక్ష్ణంగాచూచి]

వెంక: ఎట్టి సద్దుకున్నావమ్మా?

జానకి: సద్దుకుంటూనులే అన్నయ్య రావాలిగా.

వెంక: సద్దుకో! వేళయింది.

ఏడు: వాన్ని వెళ్లిపొమ్మన్నా బాబాయ్! లేతవంకాయలు తర్వాత నీ యిష్టం.

వెంక: ఉండరా! వెధవ వంకాయిలూ నువ్వూ నూ. (మండి పడ్తాడు.)

ఏడు : సరే నీయిష్టం. మించిపోతే పొరక వేనూనని చెప్పాను. నాకేంలే, మీయిల్లు మీయిష్టం. యిక్కడ రెండు రోజులుండి పోయేవాడ్ని నా యిష్టం సాగుతుందా యిక్కడ?

జానకి: రెండురోజుల్లో వెళ్లిపోతావా అన్నయ్యా.

ఏడు : పోక యెల్లకాలం యిక్కడే కూర్చుంటానా... రెండు రోజులు కాకపోతే నాలుగు రోజులు.

[లోపల "వంకాయలు-వంకాయలు" అని అరుపులు-సోమశేఖరమనే పొరుగింటి పెద్దమనిషి లోపలికి వస్తాడు]

సోమ : ఆవంకాయలమ్మి అలాగే నించుంగోయ్-నువ్వొచ్చి యిక్కడే కూర్చున్నావ్.

ఏడు : వద్దుట్లండి - వెళ్ళమనండి.

సోమ: బాగుంది. అంత బేరంచేసి ఆఖరికి బా-అది తిడుతుంది కూడాను. అన్నోవో నువ్వే తినిరా, పో.

ఏడు : నే ననుకొంటూనే వున్నాను. నే నెందుకు చేశానా బేరం అని. ముందుకే కాబోలు-యేరో లేత వంకాయలుకదా అని పిల్చా గాని.....

[అని సణుక్కుంటూ వెళ్తాడు]

[నే పథ్యంలో : ఏమి : గేపురా అమ్మా - వంకా:-
మూశినా బేరంచేశిండు మొనగాడు-"వంకాయలు-
వంకాయలు" అరుపులు క్రమంగా దూరంపోతాయి]

వెంక: ఊఁ! టైం అవుతోంది - వాడొచ్చేలోపున నువ్వు
పెట్టె సర్దుకోవమ్మా.

[జానకి లోపలకి వెళ్తుంది]

సోమ: వెంకట్రామయ్యగారూ! అమ్మాయిని అత్తవారింటికి
పంపిస్తున్నారా ఏమిటి ?

వెంక: ఆఁ! ఆఁ! మావాడు చీరకొనుక్కురావటానికి వెళ్లాడు;
రాగానే.....

సోమ: చీరలు చాలా ఖరీదుగా వున్నాయండీ.

వెంక: అయితేమాత్రం యేం చేస్తాం... నగలు నాణ్యాలు
పెట్టలేక పోయినా యింటికి వచ్చినఆడబిడ్డకు యింత
పసుపు కుంకుమన్నా పెట్టొద్దూ.

సోమ: అవున్లెండి - అసలే వారికి కోపంగావుందే... ఆ నగ
లివ్వలేదని.

వెంక: ఆఁ! నిన్నటిదాకా ఆ నగలకోసం చేసిన అల్లరివింటూ
వింటూనా్నరుగా - యిప్పుడిదీ పెట్టకపోతే...

సోమ: ఆ పాతగోల కాస్తా మళ్ళా రేగుతుంది.

వెంక: పాతగోలా...అయ్యోరామా – అప్పుడే పాతదై పోయిందా. నిన్న మొన్నటిదాకా దాన్ని వేపుకు తింటూన్నారు ఆ నగల కోసం

సోమ: పోనీ విసిరిపుచ్చుకుని మొఖాన కొట్టలేకపోయారూ.. నిజానికి తల్లి నగలు పిల్లకి వెళ్ళవలసినవేగా.

వెంక: వెళ్ళవలసినవే– కానీ నేనుమాత్రం యేం చెయ్యను. దాని తల్లిజబ్బుకి వెయ్యిరూపాయలు అప్పు అయింది ఆ నగలమ్మి అప్పు తీర్చవలసివచ్చింది – లేకపోతే వాళ్ళ మొహాన్నే కొట్టేవాణ్ణి.

సోమ: అదీ నిజమే మీరుమాత్రం యెక్కడనుంచి తెస్తారు. ...ఆ మీరు పెన్షను తీసుకున్నారా ?

వెంక: ఆ తీసుకున్నాను కాని మీకివ్వాల్సిన రెండు రూపాయలు వచ్చే నెల్లో యిస్తాను.

సోమ– అరే! చాలా అవసరమొచ్చిందే కావాలండీ రెండు రోజుల్లో మళ్ళీ యిస్తానుగా.

వెంక: కాని డబ్బుకి చాలా యిబ్బందిగా వుందండి.

సోమ: వుం ఊఁ – ఉంటుంది కాని నాకు చాలా అవసర మొచ్చింది. లేకపోతే మిమ్మల్నడుగుతానా.

వెంక: సరే తీసుకోండి.

[ఏడుకొండలువచ్చి సోమశేఖరమునకిచ్చే రూపాయలు చూస్తాడు]

వెంక: ప్రసాద్ యింకా రాలేదే. వస్తున్నాడేమోచూడరా ఏడుకొండలూ. అమ్మా – జానకీ–కాలేదుటే యింకా (లోపలికి వెళ్తాడు)

ఏడు : వస్తాడులే – వెళ్ళినవాడు రాడా ఏమిటి (వెంకట్రా మయ్య వెళ్ళగానే) చూసిరావాలిట–చూసిరావాలి పదణాలకి మొహం చూసుకున్నారు గాని చాకిరీ చేయించుకోవడానికి వెనక తీయరు. గతిలేక వచ్చానను కున్నారు కాబోలు యిక్కడికి–చూడండి సోమ శేఖరంగారూ.

సోమ: పోనిద్దూ వాళ్ళబుద్ధి వాళ్ళది–యీచిన్న విషయానికేం.

ఏడు : అప్పుడే లోకువ కట్టేస్తున్నారండీ– ఆర్నెల్లన్నా అవ లేదు. ఏదో మా "ఫాదరు" పోయిన కొత్తలో బెంగ పడిపోతానని నేనొస్తే......

సోమ: మరే – వూరికే రమ్మంటే వస్తావా ఏమిటి – ఏదో యిబ్బందిలోవుండి.

ఏడు : నాకిబ్బందేమిటండీ – మా అమ్మకి ఎకరంన్నర మాగాణీ–ఏభై సెంట్ల మెట్టపొలముంది. వీళ్ళకిమల్లేదమ్మిడీ ఎత్తు ఆస్తిలేని వాణ్ణనుకున్నారు కాబోలు.

సోమ: ఆహాఁ! యింకేం.

ఏడు : ఆ – ఏదో – ఎంతలేదన్నా అన్నదమ్ములవాళ్ళం గదా అని ఆపేక్షపడి నేనొస్తే, నేనంటే అసలు లెక్ఖేలేదండి వీళ్ళకి.

సోమ: ఆఁ–వుత్త నీచులు పోనిద్దూ.

ఏడు : అసలు నీచత్వమంతా యీ వూళ్ళో–యీయింట్లోనే వుంది. వీళ్ళు నీచులుసరే యీ యింటాయన వీర భద్రయ్య వున్నాడే ఆయన నీచుడున్నర.

సోమ: (కులాసా పొంగుతుంది) అవునవును.

ఏడు : ఆయన్ని ఏంచేస్తే పాపముంది మీారు.

సోమ: ఏం చేశాడేం.

ఏడు ; ఆఁ – ఏంచేశాడేమిటి – చాలాచేశాడు. ఒకళ్ళ-ళ్ళ నన్నమాటలు మీాబోటి పరాయివాళ్ళతో చెప్ప కూడదు–అందులోనూ మిమ్మల్నన్నమాటలు మీాతో అసలు చెప్పకూడదు.

సోమ: నన్నే – ఏమన్నా అన్నాడా ఏం.

ఏడు : ఎవర్నో అంటే నేను పట్టించుకోనేవాణ్ణిటండీ.

సోమ: అయితే నన్నే. అన్నాడా యేం ?

ఏడు : మిమ్మల్నేమనగలడండీ – అంతగా అయితే వృత్తి చవటలన గలడు – కాకపోతే పెద్ద వెధవముండ లనగలడు. మొన్న పౌర్ణమినాడు సాయంత్రమే అనుకుంటా. ఆ మటుగుజ్జు మాధవయ్యతో అంటూంటే నే విన్నా–అప్పుడే అటు నేను హోటలుకి పోతున్నా– లేకపోతే నాకేమవసరం వింటానికి.

సోమ: అది సరేలే – ఏమన్నాడు నన్ను.

ఏడు : మిమ్మల్ని గురించి కాదండీ.

సోమ: మరి – ?

ఏడు : మీా వాళ్ళనుగురించి.

సోమ: మా వాళ్ళను గురించా – ఏమన్నాడు?

ఏడు : ఆఁ—పెద్దగా ఏమన్లేదనుకోండి - వృత్తగయ్యాళి అని. మగరాయడని - యింకా ఏవో యిలాగే ... మిమ్మల్ని గురించి ఒక్కటే అన్నాడు. ఆమె గీచిన గీటు దాటలేని ఆటబొమ్మని...

సోమ: అంతమాటన్నాడే - కనుక్కుంటా వీడి సంగతి. నాకు తెలియదూ, మొన్ననేగా బెండకాయలకోసం గోడ దూకుతుంటే చావబాదారు పట్టుకుని - ఎవరికి తెలియదు వీడిసంగతి; కనుక్కుటానుండు - కనుక్కుంటా.

ఏడు : కనుక్కోండి - కనుక్కోండి ... ఏమంటాోయి; మళ్ళీ నే చెప్పానని చెప్పకండి, చెప్తే మనకీసంగతులు అసలు తెలియకుండా పోతాయి మీతో చెప్ప డాన్కి...అది సరేకాని - మిమ్మల్నొకటి అడగా లనుకుంటున్నాను.

సోమ: ఏమటదీ.

ఏడు : యిస్తానంటే చెపుతా.

సోమ: డబ్బు కాదుగదా.

ఏడు : అదేనండీ - కాస్త అవసరమొచ్చింది - ఒక రూపాయి

సోమ: మీ బాబాయినడుగు - యివాళే పెన్షన్ తీసు కున్నాడు.

ఏడు : అయనొ్నకటడుగుతాను – మీారొకటివ్వండి.

సోమ : యిప్పుడు నా దగ్గరేం లేదే – రేపు తప్పకుండా యిస్తారా.

ఏడు : మా బాబాయిదగ్గర యిప్పుడేగా తీసుకున్నారు మీారు.

సోమ : అబ్బే – అది సాయిబు కొట్లో యివ్వాలి.

ఏడు : మీారివ్వదల్చుకోపోతే సరేలెండి.

సోమ : యిస్తానన్నానుగా – రేపుదయం రా – (వెళ్ళిపోతూ) తప్పకుండా వస్తావుగా.

ఏడు : పోనీలెండి ఒక బేడ యివ్వండి.

సోమ : బేడ ఎందుకు ?

ఏడు : యివ్వవయ్యా; బేడకోసం పెద్దప్రశ్న వేస్తావ్ – ప్రశ్న.

సోమ : ఎందుకో చెప్పు – యిస్తాగా (అంటూ జేబులో చెయ్యి పెట్టాడు)

ఏడు : హోటల్లో నిన్న ఒక బేడ యివ్వాలి. యీ బేడ యిచ్చేస్తే మళ్ళీకాఫీతాగి రేపిస్తాననొచ్చు,

సోమ : (జేబు తడుముకుని) అరే – చిల్లర లేదే.

ఏడు : పోనీ ఆ నోటివ్వండి.

సోమ : అమ్మో – నోటే – మధ్యాహ్నం రా. బేడయిస్తాను.

ఏడు : అప్పుమీాద అప్పుపెడితే బాగుండదయ్యా.

సోమ : పోనీ కాసేపుండిరా.

(వె ళ్తా డు)

ఏడు : వస్తాను – వస్తాను – వదిలేస్తానను కున్నావేం.

[వెంకట్రామయ్య లోపల్నుంచి లెక్కపెట్టుకుంటూ వస్తాడు]

వెంక : రూపాయిన్నర...రూపాయిన్నరుంది...

ఏడు : ఎంత ?

వెంక : రూపాయిన్నర.

ఏడు : మరే...బాబాయి.

వెంక : రూపాయిన్నరతో నెలరోజులు...ముప్పయిరోజులు గడవాలి.

ఏడు : మరి పెన్షనంతా ఏంచేశావ్.

వెంక : ఖర్చుచేశాను.

ఏడు : అంతా.

వెంక : ఆఁ – అంతా – యీ రూపాయిన్నర తప్ప.

[చేతిసంచి, కాగితం పొట్లాంతో ప్రసాద్ వస్తాడు]

ప్రసా : యిదిగో నాన్నా.

వెంక : తెచ్చావుట్రా.

ప్రసా : ఆఁ – ఇవిగో – (చీర, రవికలగుడ్డ యిస్తాడు)

వెంక : (అవి తీసుకుని) జానకీ – జానకీ – (జానకి రాగా) యిదిగోనమ్మా; చీరె ఎలావుంది.

జాన : బాగుంది నాన్నా.

ఏడు : ఎంతయిందిరా.

ప్రసా: పదిహేను రూపాయలు.

ఏడు : [illegible]దండగ పదిహేనురూపాయలు – అర రూపా

యల్లో తీసుకువస్తానీచీరను అనవసరంగా పదిహేను రూపాయలు. మంచి వస్తువుకు ఖరీదు పెట్టరులే. నవనవలాడుతున్నాయి. వంకాయలు.

వెంక: (చనిపోయిన భార్య జ్ఞాపకం రాగా పిల్లలకు తెలియకుండా ఒకమారు తల్చుకుని) మళ్ళీ వర్షాకాలం వస్తుంది. నువ్వో బయలుదేరమ్మా-కొత్తచీర కట్టుకురా. (అని ప్రసాదుచే యిప్పిస్తాడు. జానకి తీసుకుని వెళ్తుంది) పిచ్చిపిల్ల: మేము ఎన్ని తంటాలన్నా పడుదుం - నువ్వైనా సుఖంగా వుంటే-(అంటూలోపలికి వెళ్తాడు)

ఏడు : ఇంతకూ నువ్వు కాలేజీకి ఎప్పుడెల్తావురా ప్రసాదూ?

ప్రసా: ఏం నీకెందుకు ?

ఏడు : ఏం లేదు – నీ నల్లకోటుందే...అది నాకిచ్చి వెళ్లుదూ– ఒక్కకోటన్నా లేకపోతే ఏం పెద్దమనిషితరహాగా లేదు.

ప్రసా: సరేలే-నాకున్న మంచికోటల్లా అదొక్కటే.

ఏడు : అంత లోకజ్ఞానం లేదేంరా – వట్టి స్టూడెంటువి నీకెందుకురా కోట్లు అని.

ప్రసా: మరి థర్డుఫారం గ్రాడ్యుయేటువినీకెందుకు వాలా ఏమిటి?

ఏడు : కానీలే – నీచేత లేదనిపిద్దామనే అడిగా.

వెంక: (వచ్చి) బండి పిల్చుకురారా ఏడుకొండలూ.

ఏడు : ఎందుకు బండీ ?

వెంక: జానకిని పంపిస్తాద్దూ....

ఏడు : జేబులో రూపాయన్నర లేదూ—ఇప్పుడు బండిఎందుకో—

ప్రసా: హుఁ – (ఏడుకొండలమీద విసుక్కని) నేను తీసుకొస్తాలే నాన్నా. (బయటకు వెళ్తాడు)

ఏడు : అహాఁ – అత్తఁవారిల్లు నాలుగు ఫర్లాంగు లన్నా లేదయ్యే – పెట్టె ప్రసాద్ తీసుకుపోతే సరిపోలా – వృత్త అతిశయం కాకపోతే.

వెంక: దూరమయినా కాకపోయినా అత్తవారింటికి పంపేటప్పుడు నడిపించి పంపనా – ఆచారానికి విరుద్ధం కాదూ – లోకులు ఏమనుకుంటారు.

ఏడు : ఆఁ – అత్తవారిల్లు: సాధించీ. వేధించి–తిట్టి. కొట్టి – చంపే అత్తవారిల్లూ ఒక అత్తవారిల్లేనా.

వెంక: హుష్–ఎవరన్నా వింటార్రా.

ప్రసా: (వచ్చి) బండి వచ్చింది నాన్నా – జానకీ – (లోపలికెళ్తాడు)

[కాన్స్టేబుల్ ప్రసాద్ పెట్టె తీసుకుని వచ్చి బయట బండి వాడికిస్తాడు. వెనకనే జానకి వస్తుంది]

జానకి: (కళ్ళనీళ్ళతో) వెళ్ళివస్తా నాన్నా.

వెంక: వెళ్ళిరా అమ్మా – వెళ్ళిరా – (జేబులోంచి అర్ధరూపాయి తీసి) ఈ అర్ధరూపాయి దగ్గిరుంచుకోఅమ్మా.

జాన : ఎందుకులే నాన్నా.

వెంక: ఎందుకయినా వుంటుంది. వుంచుకో అమ్మా.

జాన : తీసుకొన్ని వస్తా - వస్తానన్నయ్యా,

[వెళ్తుంది. వెంట ప్రసాద్ వెళ్తాడు]

వెంక : హుం - పిచ్చిపిల్ల. నీ కాపరమన్నా సరిగావుంటే నాకేబెంగా వుండేదికాదు. (ఏదో జ్ఞాపకంవచ్చి) ఆఁ ఆఁ - ఏడుకొండలూ యీ అర్ధరూపాయి బండి బాడుగ యిచ్చిరా.(ఏడుకొండలు తీసుకుని వెళ్తాడు) యిక యీ అర్ధరూపాయి వుంది - ముప్పయి రోజు లకి అర్ధరూపాయి...

[లోపల్నుంచి 'వెంకట్రామయ్యగారూ' వెంకట్రా మయ్యగారూ' అని రెండుమార్లు పిలిచి యింటి యజ మాని వీరభద్రయ్య వస్తాడు]

వీరభ: పెన్షన్ వచ్చింది కాబోలు యీ నెల అద్దె యిస్తారూ

[వెంకట్రామయ్య చేతిలో మిగిలిన ఆ అర్ధరూపాయి అప్రయత్నంగా కింద పడిపోయింది]

వెంక : వచ్చింది గానీ - అంతా ఖర్చయి పోయిందండీ. అమ్మాయిని అత్తవారింటికి పంపించానుకదూ -ఏదో చీరా అదీ -

వీరభ: నేననుకుంటూనే వున్నా...దానిసంగతి సరేకాని... మీరు త్వరలో వేరే యిల్లు చూసుకుంటే బాగుం టుంది...అహఁ - తొందర లేదు - మీ అనుకూలం చూసుకునే కానివ్వండి.

వెంక : యిల్లు ఖాళీ చేయమంటూరా.

వీర : ఆఁ – అదే; మా అవతలభాగం ఖాళీఅయింది కామా – ఆ పెద్దభాగంతో యిదీకలిపి మొత్తంఅద్దె కిద్దామంటోంది మా ఆవిడ.

వెంక : చూశాయా – వీరభద్రయ్యగారూ – మేం పడుతున్న అవస్థలు మీరు చూస్తున్నారుగా – కుర్రవాడి చదు వింకా పూర్తికాలేదు. వచ్చేపెన్షను చాలక మేం అవస్థపడుతున్నాం – ఏదో మీరు కాస్త కనిపెట్టి వుండాలి కాసి...

వీర : మీరూ మా కష్టనిష్టూరాలు కాస్త కనిపెట్టాలి. అద్దెకొంపగదా అని చచ్చేదాకా వదలకుండా వుంటే ఎల్లా.

వెంక : పై నెల్లో మీ అద్దె పూర్తిగా యిచ్చేస్తాను.

వీర : యివ్వరని కాదు నేననేది – మాఆవిడ రెండుభాగా లూ కలిపే యివ్వాలంటోంది. మీకోసం మా మొగుడు పెళ్లాం దెబ్బలాడుకోమా?

వెంక : అందాకా ఎందుకులెండి.

వీర : ఎందుకేమిటి – అందాక రానేవచ్చింది వ్యవహారం

సోమ : (వచ్చి వీరభద్రయ్యతో) మీకోసమే వచ్చా.

వీర : (వినయంగా) పనేమన్నా వుందా.

సోమ : ఆ – చాలా పెద్దపనే వుంది.

వీరభ: ఏం పనబ్బా...మీఅమ్మగారి తద్దినం యిప్పుడన్నా కాదే.

సోమ: చాల్లేవయ్యా వేళాకోళాలు మొదలెట్టావ్ - వేళాకోళాలు. నీకొక్కడికే చేతవుననుకున్నావా?

వీరభ: మరి - పోనీ - పనేమిటో సెలవియ్యండి.

సోమ: సెలవివ్వండి - అతివినయం ధూర్తలక్షణం-మేమూ నీ మాత్రం పరువుగా బ్రతుకుతున్నాంలే.

వీరభ: యింతకీ అసలుసంగతి సెలవిచ్చారుకాదు.

సోమ: చూడండి వెంకట్రామయ్యగారూ - ఇంకా అసలు సంగతంటాడు - అక్కడికేం తెలియనట్టు - సిగ్గులేకుండా.

వీర: మీరనవసరంగా మాటలు మీరుతున్నారు. అసలు సంగతి చెప్పకుండా

సోమ: అసలు సంగతే తెలియదేం? ఆ మరుగుజ్జు మాధవయ్యతో ఏమన్నావ్.

వీర: ఏమన్నాను.

సోమ: ఏమనాలి యింకా - అన్నదేమిటోనాకు చెప్పేరులే.

వీర: మరుగుజ్జు మాధవయ్యతో మొన్న పౌర్ణమినాడు నువ్వు అన్నన్నమాటలు నాతోనూ చెప్పారు.

[యీ సమయానికే ఏడుకొండలు వచ్చి- భయంతో మంచం వెనక దాక్కుంటాడు]

సోమ: పౌర్ణమినాడు - మాధవయ్యతో - నేనన్నమాటలా?
వీర : ఆఁ! పౌర్ణమినాడు సాయంత్రం నాలుగు గంటలకి.
సోమ: పౌర్ణమి సాయంత్రమే - ఎలా దబాయిస్తున్నాడో చూడండి వెంకట్రామయ్యగారూ. పౌర్ణమి నాడు సాయంత్రం ఆరుగంటలదాకా నేను నిద్రలేవనేలేదు. కావాలంటే నచ్చిమాఆవిణ్ణడుగు-నువ్విప్పుడే అన్నావుట మాధవయ్యతో "మా ఆవిడ గయ్యాళి" అని.
వీర : ఛా! ఛా! అంటే మాఆవిడ నంటూగానిమీఆవిణ్ణా!- అసలు ఎవర్ని ఏమంటానికన్నా ఆవేళఅంతాకరణం గారింట్లో భోజనానికి వెళ్ళి కడుపునొప్పితో వాళ్ళ రుగుమీదే కూర్చున్నానాయె - వెళ్ళి కరణంగారి నడిగినాసరే, వచ్చి మా ఆవిణ్ణడిగినా సరే.
వెంక: యింతకీ యీ మాటలు మీకెవరు చెప్పారండీ?
సోమ: యింకెవరు, మీ ఏడుకొండలే.
వెంక: మరిమీతో ఎవరుచెప్పారు.
వీర : నాతోనూ మీ ఏడుకొండలరావే చెబుత.
వెంక: యింకేం, తేలిపోయిందిగా.
సోమ: అయితే యిది ఏడుకొండల నాటకమన్నమాట.
వీర : యింకా అనుమానమటయ్యా-ఒకళ్ళమీద ఒకళ్ళకు చెప్పాడు. చెబితే చెప్పాడుగాని చేతి చిలుమేమన్నా వదిల్చాడా.

సోమ: ఆ! ఒక రూపాయి అడిగాడు కాని యివ్వలా.

వీర : పోనీలే అదృష్టవంతుడివి - నాకు రెండురూపాయలొది లాయి... వెంకట్రామయ్యగారూ-ఏడంటీ. మీ ఏడు కొండలు?

సోమ: ఒకసారి మీ ఎదటే అడుగుతాం, పిలవండి.

వెంక: బండి బాడుగ యివ్వటానికి వెళ్ళాడు.

సోమ: మా అరుగుమీద కూర్చుందాం రండి; వచ్చేదోవ అదే.

వీర : పదండి - పదండి యివాళ కనుక్కుందాం యితగాడి సంగతి.

[యిద్దరూ వెళ్తారు. మంచం వెనకనుంచ ఏడుకొం డలు బయటికి వచ్చి పారిపోబోయాడు - వెంకట్రామయ్య చూచి]

వెంక: యిక్కడే వున్నావుట్రా.

ఏడు : దణ్ణంపెడతా బాబాయ్ - దణ్ణంపెడతా - కేకలు వేయకుబాబాయ్. కాళ్ళమీద పడతా.

వెంక: ఏం పనులురా యివి.

ఏడు : ఏంలేదు బాబాయి - దణ్ణం.

వెంక: యిక్కడి మాటలక్కడ - అక్కడి మాటలిక్కడ - అన్నీ అబద్ధాలు.

ఏడు : అంతా అబద్ధం కాదు బాబాయ్ - కొంత ...

వెంక: ఏడిశావ్ – నిజమయితే మాత్రం యిలా చెప్ప మన్నారా.

ఏడు : కోపం వద్దు బాబాయ్ – కేక లేయకు బాబాయ్.

వెంక: లేనిపోనివన్నీ కల్పించి యింటిమీదకీ కజ్జాలుకూడా తెస్తున్నావా.

ఏడు : కేక లేస్తే వాళ్ళు మళ్లీ వస్తారు బాబాయ్.

వెంక: యిన్నేళ్ళొచ్చి నీకింకా బుద్ధి రాలేదురా.

ఏడు : రాలేదు బాబాయ్ – కొడితే వస్తుందేమో బాబాయ్ – కొడితే కొట్టుగాని కేక లేయకుండా కొట్టు బాబాయ్.

వెంక: యింకేంబుద్ధి ...

[ప్రసాద్ వస్తాడు]

వెంక: వెళ్ళి వచ్చావుట్రా.

ప్రసా: ఆ – దింపివచ్చా.

వెంక: బావ కనుపించాడా.

ప్రసా: కనిపించాడు – కాని పలకరించ లేదు.

వెంక; అతను పలకరించకపోతే నువ్వు పలకరించక పోయావా.

ప్రసా: ఏం పలకరించను; చూడగానే ముఖం ముడుచుకు పోతే.

వెంక: పోతేమాత్రం ఆ మాట మనమీద ఎందుకుంచుకో వాలి.

ప్రసా: ఏమో, నాకు పలకరించాలని బుద్ధే పుట్టలేదు.

వెంక: బాగానేవుంది ... మరి సాయంత్రం నీ ప్రయాణం సంగతేమిటి ?

ప్రసా: ఏదో చూద్దాంలే - - తొందరేమొచ్చింది.

వెంక: అలా అంటావేమిటిరా - ఆలశ్యం అయితే రోజులు పోవూ.

ప్రసా: పోతే పోతాయి; ఏం చేస్తాం.

వెంక: బాగానే వుంది.

[వెంకట్రామయ్య కాసేపు ఆలోచించి కండువా, చేతికర్ర తీసుకుని బయలుదేరతాడు.]

ప్రసా: ఎక్కడికి?

వెంక: అప్పుకోసం - చెల్లారెడ్డి వడ్డీకేమైనా యిస్తాడేమో కనుక్కొస్తా.

[వెళ్తాడు. ఏడుకొండలు క్రిందపడ్డ అర్ధరూపాయికాసును ఎవరూ చూడకుండా అటూయిటూ చూసి చటుక్కున కాజేసి. . .]

ఏడు : ఒరేయ్ ప్రసాదూ - నర్గీసు ఎడ్రసు తెలుసునురా.

ప్రసా: ఏం విశేషం ?

ఏడు : నీకు తెలిస్తె చెప్పు; వెధవప్రశ్న వేయకు.

ప్రసా: నాకు తెల్సినా చెప్పను.

ఏడు : పోనీలే నువ్వు చెప్పకపోయినా నేను తెల్సుకో గలనులే – సినిమా రంగానికి ప్రశాస్త్రేసరి మూడు నిమిషాల్లో వస్తుంది.

ప్రసా: ఏంరోయ్ – సినిమా పిచ్చిలో పడుతున్నావ్.

ఏడు : యిప్పుడేం చూశావ్ – సినిమాలో కెక్కినప్పుడు చూడు.

ప్రసా: సినీమాలో చేరతావా ఏం.

ఏడు : మొన్న మంగలాడు అన్నాడుగా.

ప్రసా: ఏమన్నాడు?

ఏడు : "ఏం పంతులుగారూ – తల రాజ్ కపూరల్లే పెంచే శారు. అన్నాడు.

ప్రసా: ఓహో – అయితే.

ఏడు : ఓరి ! యింతేనా – యింకా అర్థంకాలే మనం వెళితే వెంటనే రాజ్ కపూర్ అయిపోయామన్నమాటే... నెళ్లాలేగాని......

[మాటలు వినకుండానే ప్రసాద్ లోపలికి వెళ్తాడు; సోమశేఖరం వస్తాడు]

సోమ: ఏమయ్యో : ఏడుకొండలూ – నన్నేదో అన్నావుట.

ఏడు : మిమల్నా – నేనేమంటానండి – ఎందుకంటానండీ – ఏ వెధవ చెప్పాడండీ నే నన్నానని?

సోమ: డబాయించకు – మన వీరభద్రయ్యగారితోనే అన్నా వుట ఆయనే నాతో చెప్పాడు.

ఏడు : వీరభద్రయ్యగారేనా- నరేలెండి. ఆయనమాట మీా రెల్లా నమ్మారండీ - ఆయన సంగతి మీాకు వేరే చెప్పాలా నేను - ఉత్తపోచికోలు - ఆడంగిరేకి.....

వీర : (వచ్చి) యిక్కడున్నావా ఏడుకొండలూ.

ఏడు : (కంగారుపడి) ఆఁ! ఆఁ! యిక్కడే వున్నానండి.

వీర : (చేతికర్రతో బెదిరిస్తూ) ఏమన్నావ్ సోమశేఖరంతో

ఏడు : అబ్బే. యింప్పుడేం అనడం లేదండీ.

వీర : నేననేది మొన్నటి పౌర్ణమినాటి మాటోయ్.

ఏడు : మొన్నమాత్రం ఏమన్నాను-ఏమీా అనలేదే. అమ్మ తోడు కావాలంటే చచ్చిన మా నాన్నతోడు.

వీర : ఏమండీ : సోమశేఖరంగారూ - ఏమీా అనలే (ముందుకు వెళ్తాడు)

ఏడు : ఆఁ! అడగండి కావాలంటే (వీరభద్రయ్య వెనకనుంచి సోమశేఖరానికి దణ్ణాలు పెడతాడు)

వీర : (సోమశేఖరం గుటకలు మింగుతూంటే) చెప్పండీ; యిందాక అన్నది.

సోమ: (నసుగుతూ) ఏమన్నాడంటే...ఏదో - అన్నాడండీ గమ్మత్తుగా......

ఏడు : ఆఁ! అది గమ్మత్తుగా అన్నానండీ.

వీర : గమత్తు ఏమిటయ్యా - ఉన్నవీ లేనివీ కల్పించిచెప్ప డం గమ్మత్తా - ఆయన భార్య గయ్యాళని- అయన పెట్టమారి మగడని అనడం గమ్మత్తటయ్యా.

సోమ: అవునండోయ్ - యీ మాట నాతోనూ అన్నాడు

ఏడు : అవునండీ వీరభద్రయ్యగారు చాల మంచి వారూ - భార్యా ఎంత గయ్యాళయినా సరిపుచ్చుకుపోతూ వుంటారూ......

వీర : కట్టిపెట్టవోయ్ మాటలు - మహానేర్చావ్ - యిలాంటి పిచ్చిపిచ్చి వేషాలేశావం టే కాళ్లిరుగుతాయి; జాగ్రత్త. యీ తడవ కూరుకున్నానుగాని యిహామీద వూరుకునేది లేదు ఏమనుకొన్నావోఁ... (వెళ్లిపోతాడు)

ఏడు : కాళ్లిరగ్గొడతాట్ట - పెద్ద మొనగాడు దిగొచ్చాడు- అన్నది నోటితో అయితే కాళ్లేంచేశాయ్.

ప్రసా: పోనీ లే; పళ్ళూడగొట్టమని చెబుతాను.

ఏడు : పళ్లూడగొడతాడేం ఏకంగా.

ప్రసా: ఏం - ఊడగొట్ట లేడంటావా ?

ఏడు : ఏడిశాడు - వూడగొడితే పోలీసు లూరుకుంటారేం.

ప్రసా: వూరుకుంటారో లేదో చూద్దువుగాని ఆయన్ని పిలచి నువ్వన్న మాట చెబుతాను - ఏమండోయ్ వీరభద్రయ్యగారు - వీరభద్రయ్యగారు.

ఏడు : ఒరేయ్ - నిజంగానే - ఆగాగు దణ్ణంపెడతా.

[ప్రసాద్, సోమశేఖరం నవ్వుతారు]

సోమ: ప్రసాదూ - మీ నాన్నగారెక్కడికి వెళ్లారోయ్!

ప్రసా: చెల్లారెడ్డి ధగ్గరికి.

సోమ: ఎందుకూ ?

ప్రసా: ఏదో చేబదులుకి - కాలేజికి వెళ్ళటానికి డబ్బు కావాలిగా.

సోమ: కాలేజి ఎప్పుడు తెరవటం.

ప్రసా: యిదివరకే తెరిచారు. రేపన్నా వెళ్ళకపోతే చాలా రోజులు పోతాయ్.

సోమ: అయితే యింకా చదువుదామనేనా ?

ప్రసా: ఏమల్లా అడిగారు.

సోమ: ఏంచదివి ఏంప్రయోజనమోయ్ యీ రోజుల్లో.

ప్రసా: నిజమే; కానీ - చదవకపోతే ఎలాగండీ.

సోమ: చదివితే ఉద్యోగాలు కాచుక్కూర్చున్నాయా ఖాళీగా.

ఏడు.: కాచుక్కూర్చున్నాయే అనుకోండి - యీ వుద్యోగాలు - ఏం వుద్యోగాలండీ కూటికి-గుడ్డకే చాలవు-ఒరేయ్ ! నామాటవిని నువ్వో మంగలిషాపుపెట్టరా.

ప్రసా: నువ్వూ భాగం కలుస్తావా.

ఏడు : నేనా - నాసంగతి వేరేవుందిలే యిందాకా చెప్పలా.

[వెంకట్రామయ్య చిరాపుస్తకాలతో వస్తాడు]

ప్రసా: ఏమయింది నాన్నా.

వెంక: ఏమయింది - చాలా మర్యాదగా మాట్లాడి యిప్పుడప్పుడే వీల్లేదన్నాడు - వెళ్ళిన పని కాకపోయినా

యీా గాడదచాకిరి న_త్తిన వేసుకున్నా, యీా పుస్త
కాలు పడేసి లెక్క-చూసిపెట్టమన్నాడు. నల్లకాదంటే
అడిగినప్పుడు యిచ్చే రెండురూపాయలు యివ్వడని
భయం ... ప్రసాద్.

ప్రసా: ... ఎందుకొచ్చిన అవస్థలు; మానేస్తానీచదువు.

వెంక: మానేస్తావా.

ప్రసా: ఆఁ – ఎందుకీ తిప్పలు యిప్పటికెల్లాగో గడిచినా
నువ్వు తెచ్చే యాభై రూపాయలతో ముంచుమాత్రం
గడుస్తుందా–ఏదో యింటర్మీడియేట్ దాకావచ్చాను.
ఏ వుద్యోగంలోనో చేరి తేసరి.

వెంక: ఏ వుద్యోగంలో చేరతావ్.

ప్రసా: ఏదో ఒకటి – రోజుకో రూపాయిచ్చేవారికే ఏ వుద్యోగ
మయినా సరే–ఏ గుమాస్తాపనో – ఏ రోడ్డు మేస్త్రీ
పనో – ఆఖరికి ఏ కూలిపనో.

వెంక: కూలిపనా–నేను బ్రతికుండగానే–నా బిడ్డ– కూలిపనా.

ప్రసా ; ఏదయితే ఏం పొట్టగడవటానికి.

వెంక : పొట్టగడవటానికి దేనికిపడితే దానికి దిగితే లోకులు
ఏమను కుంటారు ?

సోమ : అదిగాదు ప్రసాదం – మీానాన్న హెడ్ గుమస్తాచేసి
ఎంతో గౌరవం. ప్రతిష్ఠ సంపాదించాడు...

ప్రసా : సంపాదించాస్తే.

సోమ : అంతవాడి కొడుకువి యిలా నీచప్పనులకి దిగితే ప్రపంచం భరించదయ్యా.

ప్రసా : భరించక ఏం చేస్తుందీ ?

సోమ : 'అన్నన్నా' అని ముక్కుమీద వేలేసు కుంటుంది. "చూశావా ఫలానివారబ్బాయి" అనిఅనుకుంటుంది

ప్రసా : అనుకోనీయండి. మాకష్టాలు గమనించని గుడ్డిలోకం ఏమనుకుంటే నాకేం.

సోమ : అలా అంటే ఎలా – అడుక్కుతిన్నా పొట్టగడుస్తుంది మరి అడుక్కు తినగలమా ?

వెంక : లోకం పలువిధాలు – లోకచక్రం ఒకతీరూ తెన్నూ లేకుండా నడుస్తుంది. మనం సంఘజీవులం–లోకాన్ని విస్మరించి జీవించలేం. దాని . నడకలోనే మన జీవితాన్ని – మన ప్రవర్తన్ని – సరిదిద్దుకుని –సరిపుచ్చుకుని కాపురం చేయాలి. అనుభవ పూర్వకంగానో–ఆచార ప్రకారంగానో అందరికీ ఒక వరవడి అలవాటయిపోయింది. ఆ చక్రం అల్లా తిరగాల్సిందే – అల్లా తిరగాల్సిందే.

ప్రసా: అయితే మన కిల్లా గడవాల్సిందే-అర్థంలేని ఆచారాలు–అనవసరమైన ఆదర్శాలు. అంతులేని భయాలతో మన జీఖితాన్ని మనం నాశనం చేసుకోవాల్సిందే...మనం చేసే ప్రతిపనికి లోకం యేమనుకుంటుందోనని భయపడితే మన బ్రతుకు లిట్లా బ్రద్ద

లవాల్సిందే. ఎదిరించి నిలబడిన వాడి నేంజేస్తోం దీ లోకం ? మన మేం మతద్రోహం. మానవద్రోహం చెయ్యటం లేదుగా ? మనకోటు మనకొల్లలో కత్తిరించక లోకపు కొల్లల్లో కత్తిరిస్తామా చెప్పు ? మన పరిస్థితులికి మనం సర్దుకోవాలి గాని అందనివాటికి ఆశించటం ఆదర్శమా, నాన్నా ?

వెంక: నువ్వు కూలిపని చేయడం మనపరిస్థితుల్ని సర్దుకోవడమవుతుందా ?

ప్రసా: కూలిపనే కాదు; ఏది దొరికితే అదే చేస్తా.

సోమ: అదృష్టం వుండాలిగాని - ఏం జేస్తేనేం. కలిసిరావటానికి. ఏదో ఒక ఉద్యోగంలో జేర్పించండి.

ప్రసా: సోమశేఖరంగారూ! నాకో ఆశవుందండీ.

సోమ: ఏమిటది ?

ప్రసా: మీ మిల్లుమానేజరుతో చెప్పి ఎదైనా వుద్యోగం...

సోమ: అదా-అంత తేలికాలబ్బా...చూద్దాంలే - ఏదైనా మీ గవర్నమెంటు వుద్యోగాలవారికి మా వుద్యోగాలు నచ్చుతాయా అని.

ప్రసా: ఫర్వాలేదు - ఏదైనా సరే నేను సిద్ధమే.

సోమ: కానీ. చెప్పిచూస్తాలే.

ప్రసా: మీరు చెబితే కాకుండాపోదని నా నమ్మకం.

సోమ: (తనదే ప్రతాపంగా నవ్వుతాడు)

[ఇంతలో వీరభద్రయ్య గోచి ఊడిపోతున్నా గబగబా వచ్చి......]

వీర : వెంకట్రామయ్యగారూ – వెంకట్రామయ్యగారూ !
ఎందుకు సంపారండీ మీఅమ్మాయిని అత్తవారింటికి ?
అది అత్తవారిల్లా – ఉత్త యమలోకంగాని–

వెంక: ఏమయిందండీ ?

వీర : మా అమ్మాయి చెప్పింది. మీ అల్లుడుగారి ఇంటి ప్రక్కగా మావాళ్ళిల్లు – అయ్యయ్యో – మీ అమ్మాయి పడేది ఒక బాధా – ఒక లోకమా.

సోమ: పాపం చాలా ఓర్పుగల పిల్ల,

వీర : ఆ పిల్లకనగ్గాని ఇంకొకర్తె అయితేనా——

వెంక: దానికర్మ ఏంచేస్తాం.

సోమ: ఏంచేస్తారు లెండి మీరు మాత్రం – ఆస్తిపాస్తులు విచారించగలం విద్యా ఉద్యోగాలు విచారించగలం గాని–పిల్లనిచ్చేముందు గుణగణాలు విచారిస్తే తేలేవా.

వీర : మొదట బాగానే చూశేవారట – తర్వాత తర్వాత తల్లినగలు తేలేదని పేచీపెట్టారట.

వెంక: అవ్వీ వాళ్ళకే ఇచ్చేవాణ్ణి దానికాజబ్బుచేసి అప్పు అవకపోతే.

సోమ: తృప్తివుంటే అదివరకు పెట్టినవి చాలవూ – మితం ఎక్కడికి.

వీర : నిజానికి తల్లినగలు పిల్లకి పోవాల్సినవేగా.

సోమ: పోనిద్దూ: అది బాగా జరుగుతున్నవాళ్ళకి.

వీర : ఆ జ్ఞానం వాళ్ళకు లేదుగా.

ప్రసా: ఆ జ్ఞానం లేనప్పుడు గడ్డెట్టదేం యీ చూస్తూవున్న ప్రపంచం.

వీర : అశ్చాయ్-వాళ్ళకి తట్టాలిగాని యిటువంటివి ఒకళ్లు చెప్పేవా.

సోమ: ఏదో ఆ అమ్మాయి సంగతి విచారించండి. చాలా బాధపడుతోంది పాపం.

వెంక: ఏం విచారించను - ఒకటే విచారం - అన్నీ ఆ భగవంతుడే విచారించాలి.

సోమ: భగవంతుడి కోసం కాచుకూర్చుంటే పనులవుతాయి టండి యీ రోజుల్లో.

వెంక: కూర్చోక మన చేతుల్లో ఏముందండీ.

సోమ: అలా అంటే ఎల్లా - ఏదో చెయ్యాలి - ముందు ఆ అమ్మాయిని తీసుకొచ్చేయండి అక్కణ్ణుంచి.

వెంక: ఆఁ - తీసుకొచ్చి...

సోమ: తీసుకొచ్చి-క్రూయల్ ట్రీట్‌మెంటు క్రింద ముందొక కేసు - తర్వాత ఎందాకా పోయినా పోవచ్చు.

వెంక: అందాకా ఎందుకులెండి.

సోమ: మీరల్లా వూరుకోబట్టే యిలావుంది - మీరు బాగా ఆలోచించండి. మేమంతా వున్నాం వెనక-మీకు కావాల్సిన సహాయం, హంగు తేలిగ్గా లభిస్తుంది-కావా

లంటే మా బావమరది తమ్ముడు ప్లీడరే వున్నాడు-సలహాకి ఏమీ పుచ్చుకోడు...నేను వస్తాను. బాగా ఆలోచించండి-వస్తారా వీరభద్రయ్యగారూ.

వీర : ఆఁఆఁ-వెళ్దాం. వెంకట్రామయ్యగారూ-శెలవ్.

సోమ: తొందరేం లేదు. మీరాలోచించి చెప్పండి: మేం వస్తాం.

[యిద్దరూ వెళ్తారు]

వెంక: చివరి కిక్కడికొచ్చిందా బ్రతుకు.

ప్రసా: నాన్నా -

వెంక: ప్రసాదూ - జానకిని తీసుకొచ్చెయ్. ఎవరు ఏమను కొన్నాసరే తీసుకొచ్చెయ్.

ప్రసా: యిదేమిటి నాన్నా ?

వెంక: ఏం లేదు-ఏం లేదు. జానకిని-జానకి నక్కణ్ణుంచి...

ప్రసా: మీరాట్టే విచారించకండి.

వెంక: ఏం విచారించను. ఒక్కటే విచారం-నేను ఆఅంతిమ విచారణకోసమే నిరీక్షిస్తున్నా. అంతే-అంతే-అంతే ...జానకీ-

[అంటూ పడిపోబోతూంటాడు-ప్రసాద్ పట్టుకోగా..]

—o—

## రెండవ రంగం



[స్థలం – అదేగది–ఏడుకొండలు వంటరిగా కుర్చీలో కూర్చుని ఒకవుత్తరం చదువుకుంటూ వుంటాడు–వీరభద్రయ్య వస్తాడు]

వీర : మీ ప్రసాదం ఏడోయ్ కొండలరావు?

ఏడు : (ఆ వుత్తరం చూచుకునే ఏడుస్తాడు)

వీర : అదేమిటోయ్ !

ఏడు : (యీ మారు బిగ్గరగా ఏడుస్తాడు.)

వీర : ఏమిటోయ్ అది. ఏమిటా వుత్తరం?

ఏడు : మా అమ్మండి...

వీర : ఆఁ – మీ అమ్మ –

ఏడు : ఆఁ – మా అమ్మేనండీ.

వీర : చచ్చిపోయిందా? (దూరం పోతాడు)

ఏడు : కాదండీ.

వీర : మరి...చెప్పు. ఏమిటీ?

ఏడు : యీ వుత్తరం వ్రాయించిందండి.

వీర : ఏమని. జబ్బుగా వుందనా?

ఏడు : కాదండీ – మా మేనమామకండీ..

వీర : ఆఁ – మేనమామకి – జబ్బా?

ఏడు : కాదండీ. ఓదుర్బుద్ధి పుట్టిందటండీ.

వీర : అదేమిటి ?

ఏడు : నాకండీ...వాళ్ళపిల్లని...యివ్వనన్నాడటండీ.

వీర : చంపేశాడు – అదా సంగతి !

ఏడు : అంతేగాదండి.

వీర : అఁ – యింకా ఏమిటి ?

ఏడు : ఆ పిల్లని వేరే ఎవరికో యిచ్చి పెళ్ళికూడా చేస్తున్నాట్టండీ.

వీర : ఉహుఁ –

ఏడు : యీ సంగతివింటే మీగుండె బద్దలవటం లేదండీ ?

వీర : బద్దలవుతునే వుందిలే —— (నవ్వువస్తూన్నది – కాని ఆపుకుంటాడు)

ఏడు : అయ్యో – (అని బిగ్గరగా ఏడుస్తాడు.)

వీర : మళ్ళీ ఏంవచ్చిందోయ్ !

ఏడు : నా గుండండీ – బద్దలయ్యి – యీ ప్రక్కో–బద్ద – యీ ప్రక్కో–బద్ద టపాటపా కొట్టుకుంటున్నాయండి.

వీర : (యిహ నవ్వు ఆపుకోలేక బిగ్గరగా నవ్వుతాడు,)

ఏడు : నవ్వుతున్నారా – పెళ్ళాగిపోయి నే నేడుస్తుంటే నవ్వుతున్నారా మీరు ?

వీర : పెళ్ళవుతుందిలే ఏడవకు.

ఏడు : యింకా నా కెవరిస్తారండి పిల్లని – (చతికిలబడి ఏడుస్తా )

వీర : ఎవరో ఒకరిస్తారులే ఏడవకు.

ఏడు : మీరిస్తారండీ ?

వీర : (కోపంవస్తుంది) ఎవరైనా యిస్తారులే – నువ్వుఏడుపు మాను.

ఏడు : పోనీ మీ రిప్పిస్తారాండి ?

వీర : చూద్దాం – ముందు ఏడుపుమాను...

ఏడు : మర్చిపోకండేం.

వీర : అల్లాగే – – అదుగో మీ బాబాయొస్తున్నారు.

[వెంకట్రామయ్య, ప్రసాద్ వస్తారు. ఏడుకొండలు వాళ్ళను చూచి లోపలికి జారుకుంటాడు.]

వీర : ఎక్కడికీ వెళ్ళారు తండ్రి కొడుకులు ?

వెంక: మన విశ్వేశ్వరయ్యగారి దగ్గరికి – వీడిని చూపించి ఏదన్నా ఒక దోవ చూపించమని అడగటానికి వెళ్లాను. ఏడీ ? దర్శనమే కాలేదు.

సోమ: (వచ్చి) ఉన్నారూ – మీకోసమే వచ్చాను వీరభద్రయ్యగారూ ?

వీర : ఏం విశేషం ?

సోమ: ఆఁ – నా మేనమామ మనమడి బావమరిదికి యీ వూరు బదిలీ అయింది.

వీర : అయితే చాలా దగ్గరబంధువే నండోయ్.

సోమ: ఆఁ – ఆఁ – అతనికి మీ పెద్దభాగం అద్దెకిస్తారేమో అని...

వీర : అది ఖాళీగానే వుంది - కాని మావాళ్ళు వెంకట్రా
మయ్యగారి భాగం కూడా ఖాళీచేస్తే రెండూ కలిపి
అద్దెకిద్దాం అంటున్నారు కాని...

సోమ: ఆఁ - కాని...

వీర : నాకు యిరవైఅయిదు రూపాయలిస్తే యిద్దామని
వుంది.

సోమ: చాలావుందే !

వీర : కరువురోజులు చూడండీ -

["నాన్నా" అంటూ ఏడుస్తూ జానకి గబగబా వచ్చి
వెంకట్రామయ్య కాళ్ళమీద పడుతుంది - జుట్టు రేగింది -
బొట్టు చెరిగిపోయింది - నుదుటి మీదవున్న చిన్న గాయంనుంచి
రక్తం స్రవిస్తోంది.

అందరూ దగ్గరకిచేరతారు వెంకట్రామయ్య జానకి
తల వళ్ళోకితీసుకుని - ]

వెంక: ఏమిటమ్మా - ఏమయింది ?

జాన : ఏం చెప్పనునాన్న...... (మాటలు పెగిలిరావు.
దుఃఖంతో)

వెంక: కొట్టారా అమ్మా ?

జాన : నన్నిక...ఆయన ఏలుకోరట (ఒక్కమారు బోరు
మంటుంది)

వెంక:
సోమ:
వీర :
ప్రసా: } ఆఁ - (ఒక్కసారిగా అంటారు.)

జాన : నా గాజులు పగలగొట్టి నాబొట్టు చెరిపేసి నన్నింట్లోంచి నెట్టేశారు.

వీర : వాడు మనిషా - పశువా ?

ప్రసా: వాడు పశువే - పశువు కాదు పాషాణం. (మూలనున్న చేతికర్ర తీసుకుని) ఆగండి - యీ సంగతి తేల్చుకొస్తాను.

సోమ: అదేమిటి ?

వీర : ఆ కర్రెందుకోయ్ ?

ప్రసా: యీ కర్రకసితీర్చుకోటానికి.

వెంక: ప్రసాదూ - మతిపోయిందా; వెళ్ళకు.

సోమ: (ప్రసాద్‌ని పట్టుకుని) తొందరపడకోయ్.

ప్రసా: వదలండి నన్ను - ఎందుకేలుకోడో కనుక్కుంటాను - ఏలుకో ననేస్తె సాగుతుందనుకున్నాడేం.

వెంక: ఆగరా అప్రతిష్ఠ - అల్లరవుతుంది - వూరుకో.

ప్రసా: అయిన అల్లరి అవనేలయింది - యింతకంటే ఏమవుతుంది - వదలండినన్ను - (పట్టుకొన్నవాళ్లు వదలరు) యివాళ తేల్చాలి యీ సంగతి వదలండి.

వెంక: తొందరపడితే ఎల్లా; వూరుకో.

సోమ: నామాట విను ప్రసాదూ - యివాల్టికి వూరుకో.

ప్రసా: ఏమనివూరుకోను - దాని మొహంచూస్తూ ఎలా వూరుకోను ? నాతోబుట్టువు కన్నీరు నా నట్టింట ఏకధారగా కారుతుంటే ఎన్నాళ్ళని వూరుకోను ?

వెంక: (చేతిలో కర్రలాక్కుని కిందపడేసి) అబ్బ - నేచెప్పేది వినరా - యీ కొట్లాటలతో మనకేమైనా లాభిస్తుందా - కొట్లాటలవల్ల పరిష్కారమయేవేనా యివ్వి -పిల్లనిచ్చినవాళ్ళం మనం - మనకడుపుతీపి వాళ్ళకేం తెల్సు. చేతిలోవున్న పనిగనక చావకొట్టారు - తరిమేశారు. ఆడపిల్ల వాళ్ళవస్తు వనుకున్నారు. ఆ వస్తువుమీద వాళ్ళకాధికారముందనుకున్నారు. కాని నాచిట్టిమీద పడేప్రతీదెబ్బ ఈహృదయంమీద తగుల్తుందనివాళ్ళకేం తెల్సు - (జానకి, ప్రసాద్ దుఃఖిస్తున్నారు) ఏడవకండర్రా - ఏడవకండి-ఏడ్చి ఏం ప్రయోజనం-ఏడ్చి - ఏడ్చి ఏం సాధించగలం...

[క్రిందపడ్డ చేతికర్రను పై సంభాషణ జరుగుతూండగానే తీసుకుని - ఏడుకొండలు నెమ్మదిగా జారుకుంటాడు-]

వెంక: ప్రసాదూ-నువ్వూరుకో - దాన్ని ఓదార్చు - నేను ఏ వీరభద్రయ్యగారినో - సోమశేఖరంగారినో తీసుకువెళ్ళి అతనితో మాట్లాడివస్తా.

ప్రసా: ఏం మాట్లాడుతాడు-అక్కర లేదు లెండి. నా చెల్లెలు నాతో బాటే యిక్కడ కలో గంజో తాగుతుంది. ఆ నరకం అనుభవించడానికి తిరిగి ప్రయత్నాలు కూడా ఎందుకు.

వెంక: అహాఁ - అది లోకధర్మం కాదోయ్-ఒకరి చేతుల్లో వుంచిం తర్వాత.

ప్రసా: ఎందుకూ-యిలా కొట్టమనా ?

వెంక: కాదురా-ఆ ప్రశ్న వేసే అధికారం మనకు లేదురా. అగ్నిసాక్షిగా అతని చేతుల్లో వుంచిన తర్వాత మనమేం చెయ్యలేం. ఏ కోర్టూ ఏం చెయ్యలేదు.

ప్రసా: ఎందుకు చెయ్యలేం-న్యాయంకోసం దెబ్బలాడుదాం-మనం నశించినా న్యాయం నశించదుగా.

వెంక: మనం నశించింతర్వాత న్యాయమేమైతే మనకేం.

ప్రసా: మనమేలాగా నశిస్తాం - అన్యాయాన్ని హతమార్చి మనం నశిద్దాం.

వెంక: నీకు తెలియదురా - లోకానికెదురు తిరిగితే మనం నశించటం మాత్రమే మిగుల్తుందిగాని - అన్యాయం మాత్రం నశించదు. మన విధి అన్యాయానికి తలవొగ్గి మనపని గడుపుకోటమే. లోకం వేయితలల రాక్షసి-ఎవరినని సాధించగల్గుదువు. నువ్వూ. మన పిల్లని మన దగ్గరే వుంచుకుని వూరుకొన్నా లోకం

మనల్నే తిడుతుంది. అక్కడకు పంపినా మనల్నే తిడుతూందిలోకం—కాళ్ళావేళ్ళ, పడి బ్రతిమాలటమే మనం చేయ తగింది. వేరే విధం చేసినా హర్షించదీలోకం—హర్షించదు.

ప్రసా: ప్రతిదానికి లోకం — లోకం—మనం యీ విధంగా అన్యాయానికి బలైపోతున్నామవి గుర్తించి—చలించని గుడ్డిలోకాన్ని గురించి మనకెందుకండీ బాధ.

[కొంతసేపట్నుంచి వీరభద్రయ్య నెమ్మదిగా జారుకునే ప్రయత్నంలో బయట గుమ్మంవరకు వెళ్తాడు — కాని సోమశేఖరం పట్టుకుని వెళ్ళకుండా ఆపుచేస్తాడు]

వెంక: ఎందుకొచ్చినఆవేశంరా యిది. మనమాటలు ఎవరు పాటిస్తారు — అది కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది — ముందు దాన్ని వోదార్చు—నేవెళ్ళి అతని పాదాల మీద పడైనా ప్రార్థించి ఒప్పిస్తా ... సోమశేఖరం గారూ — శ్రమ అనుకోకుండా కాస్త నాతోబాటు వస్తారా.

సోమ: ఎక్కడికీ.

వెంక: మా అల్లుడింటికండి — కాస్త బ్రతిమాలి నచ్చచెప్పి వద్దాం.

సోమ: రావటానికేం గానీయండి — నేను మిల్లుకి వెళ్ళాలి—చాల జరూరు పనివుంది. యీతడవకి క్షమించండి.

వెంక: పోనీ : వీరభద్రయ్యగారూ మీరైనా రండి.

వీర : యిటువంటి వాటిల్లో నా కాట్టే అనుభవం లేదండీ-
కాకపోతే రావడానికేం?

వెంక: ఫర్వాలేదు. మీరు నాతోవుండండి చాలు.

వీర : అబ్బే - అనుభవం లేకండా నేనొచ్చి మాట్లాడితే
మీ పనీ చెరుపూ - నామాటా దక్కదు- ఏం
ప్రయోజనం చెప్పండి ?

వెంక: అంతేనటరా - సరే- నేనే వెళ్తాలెండి- నేనే వెళ్తాను
ఏదీ నా చేతికర్ర...

వీర : యిక్కడే పెట్టారే యిందాక - ఏదీ ఏముంది.

సోమ: మాయమయింది- ఎంతలో మాయ మవాలి.

వెంక: సరే కానివ్వండి...(గుమ్మంవరకూ వెళ్ళి) ప్రసాదూ
నే వెళుతున్నా - జానకి జాగ్రత్త. (వెళ్తాడు)

సోమ: ఊరుకో అమ్మాయి. మీనాన్న వెళ్ళారుగా; మా
ట్లాడి వస్తారులే అమ్మా.

వీర : ఉరుకో అమ్మా-మే మంతా ఉన్నాం-ఏదో చూస్తాం.

సోమ: ఇంతకూ ఏం జరిగిదమ్మాయ్.

జాన : ఏమీ లేదండి. నాన్నగారి నడిగి నగలు తెమ్మన్నారు.

వీర : అదేనా మళ్ళీ.

సోము: సువ్వేమన్నావ్.

జాన : వి అమ్మి అప్పుతీర్చారు. యిప్పుడు రమ్మంటే ఎలా
వస్తాయ్ అన్నాను - అంతే.

వీర : యింతమాత్రానికేనా పాపం...అరే - నుదుటిమీద గాయం తగిలిందేం.

జాన : కొట్టినా - తిట్టినా - పెట్టకపోయినా సహించానండి తను లేనట్టేనని - పెళ్ళి కానట్టేనని నన్ను వెళ్ళగొట్టేశారురా అన్నయ్యా.

ప్రసా: అంతమాత్రానికి పెళ్ళి చేసుకోవడమెందుకో.

జాన : నా జన్మ నాశనం చేయడానికి - నన్నీ నరలోకపు యమలోకంలో దిగత్రొక్కటానికి.

ప్రసా: ఊరుకో చెల్లీ - యిహ యిదంతా మరచిపో - నీకు పెళ్ళే కాలేదనుకో - నాతోనే వుందువుగాని - రా-మొహం కడుక్కుందువుగాని(లోపలికితీసుకువెళ్తాడు)

వీర : పాపం ఆ అమ్మాయి మొహం చూస్తే ఎంత జాలి పుడుతుందండీ.

సోమ: అవును నిక్షేపంలాంటి పిల్ల - కర్మండీ - కర్మ.

సోమ: ఏంచేస్తాం - ఏం చేయటానికి మన చేతుల్లో ఏముంది

వీర : అదీ నిజమేలెండి.

[ఏడుకొండలు వస్తాడు]

సోమ: ఎక్కడి కెళ్ళావోయ్.

ఏడు : మన పనిమీదే.

సోమ: చేతికర్ర ఏదీ.

ఏడు : అదే - అదే. మన సన్నిధ్దీదే తీసుకువెళ్ళా.

[ప్రసాద్ వస్తాడు]

వీర : మన పని అంటే.

ఏడు : కర్ర తీసుకుని సరాసరి జానకి మొగుడి దగ్గరకు వెళ్లా. అక్కడ బ్రహ్మాండంగా దెబ్బలాడా. వాడూ – వాళ్ళమ్మా మాటలు మహా మిగిలారు. చావకొట్టే శాను పాతకర్రతో.

ప్రసా: మంచిపనిచేశావ్.

ఏడు : ఏలా బాదాననుకొన్నా వేమిటి–దెబ్బతో కర్ర విరిగి పోయిందంటే నమ్మండి.

ప్రసా: పోతే పోయింది లే.

ఏడు : వెధవ కర్రలే పాతది పోతేయేంగాని...

సోమ: అయితే వెంకట్రామయ్యగారు వెళ్ళినపని నువ్వే పూర్తిచేసుకొచ్చావన్నమాట.

ఏడు : ఓ.

వీర : చూడు ఏడుకొండలూ–అప్పుడుతీసుకున్న రూపాయిూ.

[ఏదో అనబోతాడు – ఏడుకొండలు ప్రసాద్ వున్నాడని చూపిస్తూ సైగ చేస్తాడు.]

వీర : ప్రసాదూ! జానకింకా రాలేదేమోయిూ?

ప్రసా: మొహం కడుక్కు వస్తుందండి.

వీర : యింతసేపా? వెళ్ళి చూసిరా – నాయనా. (ప్రసాద్ వెళ్ళగానే ఏడుకొండలు వెంట పోబోతాడు. పట్టుకుని) ఏడుకొండలూ! అప్పుడు తీసుకున్న రూపాయి యిచ్చావు కావు.

సోమ: యింకేమిస్తాడు లే.

వీర : యిస్తానని తీసుకున్నాడండీ.

సోమ: ఆఁ – యిస్తాడు – నా మాట విని కొండవైపు తిరిగి దణ్ణం పెట్టండి.

ఏడు : తీనిపారేస్తున్నారే – రూపాయి భాగ్యానికి.

సోమ: రూపాయి భాగ్యమేగా; యినతల పారేయి.

ఏడు : కావాలంటే తీసుకోండి. (జేబులోంచి రూపాయి తీసి విసిరేస్తాడు)

వీర : (విసిరిన రూపాయి తీసుకుంటూ) అతని దగ్గర డబ్బు వుండాలే గానీయండి వుంటె లెక్కలేకుండా పారే స్తాడు. ఆఁ –

సోమ: యిప్పుడు కాస్త డబ్బుంది లెండి–ఏమయ్యా! కఱ్ఱెంత కమ్మావ్ ?

ఏడు : కఱ్ఱా – ఏం కఱ్ఱ ?

సోమ: వెంకట్రామయ్యగారి చేతికఱ్ఱ.

ఏడు : అది విరిగిపోయిందిగా.

సోమ: నాకు తెలుసులే – నువ్వే కొట్టేశావ్.

ఏడు : ఏమండోయ్! అనవసరమైన అనుమానాలు లేవ తీసి అయినవాళ్ళలో దెబ్బలాటలు కల్పించకండి బాగుండదు.

సోమ: ఊరికే డబాయించకు – కఱ్ఱ నువ్వే కొట్టేశావ్ అమ్మేశావ్ కూడా.

ఏడు : లేదు.

సోమ: నిజం నీచేత చెప్పించలేననే - మొన్న వీరభద్రయ్య గారి కర్ర ఏమయిందో నాకు తెలియదనుకున్నావా?

వీర : నా వెండిపొన్ను కర్రా ?

సోమ: ఆc - మీ వెండిపొన్ను కర్రే. కొట్టేసి సాయిబు కమ్మాడు. మూడు రూపాయలకి.

ఏడు : అబద్ధం.

సోమ: ఆ డబాయింపే వద్దన్నాను. కావాలంటే నాతో రండి. సాయిబుచేత చెప్పిస్తాను.

ఏడు : మీకూ వాడికీ ఏం లాలూచీ వుందో - అన్యాయంగా అన్ని దొంగతనాలు నాకే అంటకడుతున్నారు. కావాలంటే గుళ్ళో దీపమార్పి ప్రమాణం చేస్తాను.

సోమ: ఏమన్నా చేస్తావ్. లెక్కేమిటి?

వీర : అయితే, వెంకట్రామయ్యగారి చేతికర్ర కూడా సాయిబు కొట్లో చేరెనట్టే.

ఏడు : యిదిగో - సోమశేఖరంగారూ! నా మీద ఊరికే నిందలు మోపకండి. అసలు నాకు వూరికేనే ఏడుపు వస్తుంది.

ప్రసా: (గబగబా వచ్చి) వీరభద్రయ్యగారూ-వీరభద్రయ్య గారూ! జానకి నూతిలో దూకేసిందండీ!

["జానకి నూతిలో దూకేసిందా" అంటూ అందరూ ప్రసాద్ వెంట పరుగెత్తుతారు. లోపల 'ప్రాణందుకో'

'ఏడుకొండలూ ఆ నిచ్చెన అందుకో' తలోమాటా అంటూ కాస్త అవీ, యివీచప్పుళ్ళుచేస్తూ హడావుడి చేస్తారు.

కొద్ది నిమిషాల్లో వీరభద్రయ్య, సోమశేఖరం, మరి కాసేపటికి ఏడుకొండలు వస్తారు. కాళ్ళూ చేతులు, బట్టలు, కాస్త తడిపొడిగా వుంటాయి.]

వీర : చాలా అభిమానంగల పిల్లండీ. పాపం.

సోమ: కాస్త కూస్తానా ? — యింతకూ మనలోమాట. దీనికంతకూ కారణం ఆ నగలే నంటారా ?

వీర : అవే. వేరే ఏముంది ?

సోమ: నగలకోసం కాపరం చెడగొట్టుకుంటారటండీ ఎవరైనా ?

వీర : వేరే కనిపించడం లేదుగా - మనకు తెలిసినంతలో.

సోమ: మనకి తెలియదుగాని ఏదో వుండే వుంటుంది.

వీర : ఏముంటుందంటారు వేరే ?

సోమ: ఏమో ! ఒకటాలోచించండి-యీ అమ్మాయి ఏమీ చేయకుండా యింతవరకూ వస్తుందంటారా ? రెండు చేతులా చరిస్తేనేగా చప్పుడు !

వీర : అదీ నిజమే ననుకోండి.

సోమ: యీ అమ్మాయిలో కూడా కాస్త ఏదో వుండే వుండాలి.

వీర : ఏమో - ఏమన్నా వుండేమో !

సోమ: ఆడది గనక బయటపడ లేదు. మొగాడు గనక బయటపడ్డాడు.

వీర : (అటువైపు చూచి) ఉష్ - ఉష్. ప్రసాదు వస్తున్నట్టున్నాడు.

సోమ: యీమాట ఎవరితో అనకండి. ఏడుకొండలూ నువ్వ్యానూ.

ఏడు : ఉహూఁ! నే నసలనను.

ప్రసా: (వచ్చి) జానకిని చూశారా. మేము పెట్టిన కొత్త చీరతోనే నూతిలో దూకేసింది.

సోమ: పాపం మనసు ఎంత కుమిలిపోయిందో, అమాయకపు పిల్ల ఆ వెధవది ఎంత కటిక గుండో.

వీర : దుర్మార్గుడు-వుసురు తగిలి తీరుతుంది వెధవకి. తలుచుకుంటేనే గుండెలు తరుక్కుపోతూంటే...

[గీర మార్చుకుని - తలకు పిడప చుట్టుకుని నెమ్మదిగా జానకి వస్తుంది.]

సోమ: వంట్లో ఎలాగుందమ్మా ?

వీర : అంత తొందరపడ్డా వెందుకమ్మా ? ఎంత కష్టాలో అయినా తొందర పనికిరాదు. కాస్త ధైర్యంగా వుండాలి. అంతేగాని...(జానకి ఏడుస్తుంది) అయ్యో పిచ్చిపిల్లా! ఏడవకమ్మా, ఏడవకు మీ నాన్నగారు వెళ్ళారుగా - అన్నీ సరిజేసుకు వస్తారులే. దిగులు

పడకమ్మా - ప్రసాదూ ! కాస్త జానకిని వోదార్చు వెయ్. మేం యిప్పుడే వస్తాం.

సోమ: కాస్త ధైర్యం చెప్పునాయనా : మేం వెళ్లి వస్తాం.

[యిద్దరూ వెళ్తారు]

ప్రసా: ఎందుకు జానకీ, ఏడుకో, యీదుఃఖం యీనాటితో చెల్లేదా - ఎన్ని కష్టాలు వచ్చినా ధైర్యంతో ఎదుర్కోవాలిగాని ఆత్మహత్యకు పూనుకోవడం పిరికితనం కాదుటమ్మా? నీ కష్టాలు అంతటితో తీరిపోతా యనుకున్నావు గాని తర్వాత నేనూ, నాన్న పడాల్సిన చిక్కులుగూర్చి ఆలోచించావా ? (దుఃఖిస్తాడు)

జానకి: అన్నయ్యా !

ప్రసా: దుఃఖించకమ్మా! అయిందేదో అయింది. యికముందీలాటి తెలివితక్కువ పనులు చెయ్యకు. యిదంతా మర్చిపో ఆ నిర్భాగ్యుడుతరిమే స్తేనువ్వుజీవించ లేవా? ఎందరు స్త్రీలు యిలాంటి అత్యాచారలకు గురికావ లేదు ? వారంతా స్వతంత్రంగా జీవించడం లేదూ ? నువ్వేదో ఫోర్తుఫారం వరకు చదివావా - ఏవుద్యోగంలోనో చేరితే నీ పొట్ట నువ్వే పోషించుకో గలవు.

జాన : అన్నయ్యా ! నేనా - ఉద్యోగం చేయడమా ?

ప్రసా: ఏం. చేస్తే తప్పా ? ఆ కసాయి కొంపలో రోజూ తిట్లు, దెబ్బలు తింటూ హీనంగా బ్రతికే కంటె

స్వతంత్రంగా జీవించడమే మేలుకదూ: నీచదువునూ తెలివితేటల్నీ సద్వినియోగం చెయ్యొచ్చు, హాయిగా, స్వేచ్ఛగా జీవించవచ్చు. యావజ్జీవం బానిసలా బ్రతికేకంటె స్వశక్తిమీద ఆధారపడి జీవయాత్ర గడపడం మేలు. స్త్రీ అబలకాదనీ, అమెక్కూడా ఆత్మాభిమానముందనీ నిరూపించు చెల్లీ ?

జాన : నాన్న అంగీకరిస్తారా అన్నయ్యా ?

ప్రసా: నీ కా బెంగక్కర లేదు. నాన్నను నేను వప్పిస్తా. సమాజంలో స్త్రీకి కూడా గౌరవస్థానం వున్నదనీ నీలాటివాళ్లు రుజువుచేయాలి.నువ్వుధైర్యంగానిలబడితే నాన్నను వప్పించే బాధ్యత నాది.

జాన : అన్నయ్యా !

ప్రసా: అరుగో...నాన్న.

[వెంకట్రామయ్య తలమీదుగా కండువా కప్పుకొని వచ్చి కుర్చీలో కూలబడతాడు]

ప్రసా: నాన్నా ! (కండువా కేసి చూసి) యివేమిటి యీ దెబ్బలు ?

వెంక: ఆడపిల్లను కన్నందుకు ప్రతిఫలం.

ప్రసా: కొట్టాడా ? యింకా నెత్తురు వస్తూనేవుంది, జానకీ! కాస్త తడిగుడ్డ తీసుకురా.

[జానకి వెళ్ళి గుడ్డ, నీళ్ళు తెస్తుంది. వెనకనే ఏడు కొండలు వచ్చి వెంటనే బయటికి వెళ్ళిపోతాడు—ప్రసాద్ కట్టు కడుతుంటాడు.]

వెంక: యింకెందుకురా యీ కట్లు – యింకెందుకురా యీ జీవితం – నా రక్తంలోని రక్తం – దేహంలోని దేహం ప్రాణంలోని ప్రాణం – దాని జీవితమంతా నిష్ఫల మయింతర్వాత యింకెందుకురా బ్రతుకు?

ప్రసా: ఊరుకోండి అంత యిదవుతారేం ?

వెంక: బ్రతికుండి; యీ వృద్ధాప్యంలో మీ బ్రతుకుల్ని చూసి కుమిలిపోవడానికేగా – నెత్తురు కారితే కారింది – కారనీ ఎడతెగకుండా చివరిబొట్టువరకూ కారిపోనీ.

ప్రసా: మీరే ఇలా అధైర్య పడితే ఎల్లా – ?

వెంక: అధైర్యం – యిక అధైర్యానికి ధైర్యానికి – సుఖానికి దుఃఖానికి – ఆశకి నిరాశకి – జీవనానికి మరణానికి – యీ గుండె అతీతమయిపోయింది. ఏకష్టనిష్టూరాలూ యీ హృదయాన్ని చలించ లేవు.

ప్రసా: ఊరుకోండి. మీరిలా దుఃఖపడితే ఎలా ? యీకష్టాల కోసమే మనం పుట్టాం – వీటి నెదుర్కుంటూనే చావాలి – అలాగే చద్దాం – యీ జీవిత సమస్యల మధ్యనే మహాధీరుల్లా పోరాడుతూనే ప్రాణాలు విడుద్దాం.

వెంక: ఓ — మనం యిదివరకే చచ్చిపోయాంరా — చచ్చిపోకపోతే జానకికి యింత అన్యాయం జరిగినా యేమీ చేయలేక సహించి వూరుకుంటామా ? ఏ విధమైన సుఖం లేకుండా — శాంతి లేకుండా — ఆశ లేకుండా అయిపోయినా యింకా ఎలా బ్రతికుండ గల్గాను___ యిహ మిగిలిందల్లా ఒక్కటె విచారం — ఒక్కటే దుఃఖం — ఏరోజు కారోజు ఎలాగడుస్తుందా అనే బెంగతో ఏరోజు కారోజు ఏదో ఒక కొత్తదుఃఖంతో బ్రతకటానికి యీ వృద్ధాప్యంలో బిడలనెందుకు కన్నానా ఏబండ రాయినో ఎందుకు కన లేదా అని...

[యిహ మాట్లాడలేక కుర్చీలో కూలబడతాడు. ప్రసాద్. జానకి కౌగలించుకొని ఏడుస్తుండగా —వీరభద్రయ్య సోమశేఖరం వస్తారు]

సోమ: వెంట్రామయ్యగారూ ! ఎంత అన్యాయం జరిగిందండీ!

వెంక: అయిపోయిందండీ వీరభద్రయ్యగారూ. నా గాలిమేడలన్నీ కూలిపోయాయి.

వీర : వింటేనే హృదయం ద్రవించుకుపోతోంది. వెధవ — దుర్మార్గపు వెధవ.

సోమ: ఎంత వెధవ కాకపోతే నగలకోసం—అవీ తల్లితాలూకు నగలకోసం — నిక్షేపంలాంటి పిల్ల నొదిలేస్తాడూ — విచారించకండి వెంకట్రామయ్యగారూ. — తలైనా తాకట్టుపెట్టి వాడి పుర్రమార్చాలి.

వీర : ఆ సంగతలా వుంచండి. ముందు మిమ్మల్ని కొట్టి నందుకు కేసుపెడితే వెధవకి మూణ్ణెల్లన్నా తప్పదు.

సోమ: డబ్బుకోసం మీరు వెనక్కి తీయకండి. మే మంతా వున్నాం. మూడుకోర్టులు త్రిప్పినా —

వెంక: ఏం త్రిప్పి ఏం లాభమండీ? ఏం తిరిగినా దాని కాపురం నిలిస్తేగా - దానికి సుఖం; నాకు శాంతి.

వీర : అదీ నిజమే లెండి. మనమే గెల్చినా మరింత కష్టాలే పెరుగుతాయ్ గాని —

సోమ: అయితే మెదలకుండా వూరుకోటమేనంటారా?

వెంక: ఊరుకోక ఏం చేస్తాం?

సోమ: ఏం చెయ్యలేమని ఆ అమ్మాయినా యింట్లో వుంచేస్తారా? ఎటూ తేల్చకుండా.

ప్రసా: తేల్చే దేమిటి? అంతా తేలిపోయింతర్వాత-అంతగా అయితే ఏ ట్రెయినింగో చదువుతుంది - దాని పొట్ట అదే పోషించుకొంటుంది.

వీర : ట్రెయినింగా? చా - చా.

సోమ: అది మనబోటి కుటుంబాలకి కాదోయ్.

ప్రసా: మరేం పర్వాలేదు. ఏదైనా చెయ్యొచ్చు. ఆ కాపరం చేసేకంటె.

వెంక: ఏదైనా దాని జీవితం నాశనమైపోయింది. యిక అంతే. విరిగిపోయిన పాలు తిరిగి మారతాయా?

సోమ: మీరు కేసు పెట్టినా, పెట్టకపోయినా ప్రసాదం చెప్పి నట్లు యిాపిచ్చిపని మాత్రం చేయకండి. ప్రసాదానికి రేపు ఏదైనా ఉద్యోగం దొరికితే మీ పెన్షన్ అతని ఆర్జన మీ కేలోటూ వుండదు.

ప్రసా: సోమశేఖరంగారూ! మీ మేనేజరుకి చెప్పారా ?

సోమ: ఏ సంగతి ?

ప్రసా: నా వుద్యోగం సంగతి.

సోమ: అదా ? చెప్పలేదోయ్ ! ఏదో ఖాళీ ఒకటి రానీ.

ప్రసా: సరేలెండి. ఖాళీ అయినప్పటిసంగతా ?

సోమ: అలా అనకు. ఆరునెల్లలోగా నీకు ఉద్యోగం యిప్పిం చకపోతే నా పేరు సోమశేఖరం కాదు.

ప్రసా: ఆరునెలలు ...... ఆరునెలలు...(సణుక్కుంటాడు.)

సోమ: వెంకట్రామయ్యగారూ! నే చెప్పింది మీ రాలో చించండి. మీరు సరే అంటే సాయంకాలమే ప్లీడరును సలహా అడుగుదాం. కావాలంటే మావాడిదగ్గరకే తీసుకెళ్ళతా -సలహాకేం తీసుకోడు. ఏదో అంతా ఒక వీధిలో వున్నాంగనక...

వీర : అండగా వుంటాం లెండి.

సోమ: వెంకట్రామయ్యగారూ! ధైర్యంగా వుండండి - ఏం పర్వాలేదు... యిహ వెళదామా వీరభద్రయ్య గారూ.

వీర : పదండి – వుండి ఏంచేస్తాం.

(యిద్దరూ వెళతారు)

ప్రసా: జానకిని ఏనర్సింగో – ట్రెయినింగో చదివిద్దాంనాన్నా.

వెంక: ఏమిటీ ?

ప్రసా: దాన్ని ట్రయినింగు చదివిద్దాం – యిద్దరం ఏవుద్యోగంలోనో చేరితే...

వెంక: ఆడది వుద్యోగం చేయటం – నువ్వేకూలిపనో చేయటమే మిగిలింది.

ప్రసా: కూలీ అన్నమాటేమిటి – ఏదిదొరికితే అది.

వెంక: (శరీరం చూపిస్తూ) యీకండలు. కీళ్లుశాశ్వతంగా చివికిపోయేవరకు కరిగిపోయైనా దానికింత గంజి పొయ్యగలను. అంతేగాని నాకూతురు నాకళ్ళముందు వుద్యోగం చేయటానికి వీల్లేదు – యిప్పటికే మనగతి యిలావుంది.

ప్రసా: రేపుమాత్రం ఏమవు తుందంటావ్ – బ్రతికివున్నన్నాళ్ళూ తిండి తినాలిగా ?

వెంక: చాలకపోతే చద్దాం – దాన్ని వుద్యోగానికి పంపించి మనం లోకంలో తలెత్తుకు తిరగ్గలమా ?

ప్రసా: యిప్పుడు తలెత్తుకు తిరుగుతున్నట్టే లెక్కా – మాట్లాడితే లోకం, లోకం – ఎవరాలోకం – యీ యింటాయన వీరభద్రయ్య – పొరుగాయన సోమశేఖరమేగా – చిల్లికానీ సహాయం చెయ్యని వీళ్ళా –

వీళ్ళలాంటి లోకులేగామన్ని గురించి ఏదో అనుకొనేది. మనం మాడిచస్తున్నా లెక్క చేయని వీళ్లా మనల్ని గురించి అనుకొనేది. దాన్ని యింట్లోంచి వెళ్ళగొడితే మాటసాయమన్నా చేయ్యనివీళ్లా మన శ్రేయస్సు కోరేది. మనకష్టాల్లో కనికరించాలనే జ్ఞానం అన్నా లేని యీ గుడ్డిలోకం ఏమనుకుంటే ఏం - అనుకోనీ - అంతకంటె ఏం జేస్తారు!

జానకి: నిజమేనాన్నా! అన్నయ్యచెప్పిందే బాగుంది. నేను ఏ ట్రెయినింగో నర్సింగో చదువుతాను.

వెంక: నీకు పెట్టడంపోయింది - నువ్వు సంపాదించి తెస్తే నన్ను తినమంటావా అమ్మా.

ప్రసా: నామాటలు మీకు చెవి కెక్కడంలేదు - మనపరిస్థితులు బాగుండనప్పుడు. మనజీవనానికి వేరేమార్గం లేనప్పుడు, పరువు మర్యాదలకోసం ప్రాకులాడితే ప్రయోజనముందా.

వెంక: వేరేమార్గం లేనప్పుడు ఏమన్నా ఏడవండి - నా గొంతులో ప్రాణం వున్నంతవరకూ యిల్లా జరగాల్సిందే.

ప్రసా: నేచెప్తే మీకునచ్చదు - సరే... నారక్తం ధారబోసి మిమ్మల్ని పోషిస్తాను. నే వెళ్లుతున్నా - ఏదో ఒక సంపాదించే మార్గం దొరికితేగాని తిరిగిరాను. అంతే

(అని గబగబా వెళ్తాడు)

జాన : (వెంటబడి) అన్నయ్యా-అన్నయ్యా-అన్నయ్యా ?

వెంక: జానకీ (అంటూ దగ్గరకు తీసుకొని దుఃఖిస్తాడు. దగ్గు తెర వస్తుంది)

—తెర—

## మూడవ రంగం

[స్థలం - అదేగది - వీరేశలింగంగారి ఫొటోమాత్రం టేబిల్ పైన వుంటుంది...... వెంకట్రామయ్య కుర్చీలో కూర్చుని వుంటాడు. వీరభద్రయ్య వస్తాడు.]

వీర : ప్రసాదూ.

వెంక: లేడండీ - యింకా రాలా.

వీర : రాలే యింకా... పన్నెండున్నర అయినట్టుందే.

వెంక: రాలేమరి - ఏదో కష్టపడి పనిచేస్తే నాల్గురాళ్ళు ఎక్కువ దొరుకుతాయని-పాపం వేళకి అన్నపానాలు లేకుండా పనిచేస్తున్నాడు...ఆఁ! యింతకూ ఎందు కేమండీ.

వీర : ఆఁ! ఏంలే. వచ్చేటప్పుడు తిక్కశంఖరం దగ్గర పన్నెండు రూపాయలు బాకీ వసూలు చేసుకురమ్మన్నాను. వచ్చేడేమో నని...(స్టూలుమీద కూర్చుంటూ) మీ వంట్లో కులాసాయేనా ?

వెంక: ఆఁ! కులాసాయే.

[లోపల్నుంచి ఏడుకొండలు బద్ధకం విరుచుకుంటూ, ఆవలింతల్తో వచ్చి చతికిలబడ్తాడు-బయట్నుంచి జానకి నీళ్ళ బిందెతో వస్తుంది.]

వీర : జానకీ – కాసిన్ని మంచినీళ్లివ్వమ్మా...చూశావ్రా మా ఆవిడ అలాగే ఓపిక చేసుకొని తెచ్చినబిందెడు మంచినీళ్లూ పిల్లి బోర్లతోసింది. సాయంత్రందాకా మంచినీళ్ళుకూడా లేవు యింట్లో.

ఏడు : మీవాళ్లు నీళ్లు తెచ్చారా యివ్వాళ ? రోజూ మీ రేగా తెస్తారు.

వీర : యివాళ నేతేలేదు లే. కాస్త ఓపిక చేసుకుని ఆమె గారే తెచ్చింది. లేకపోతే మా యింట్లో నీళ్లు ఖర్చయిపోతాయని యిక్కడ త్రాగుతున్నా ననుకున్నావా.

ఏడు : నిజంగా అలాగే అనుకున్నా సుమండీ బాగుంది. మీ ఆవిడగారు తెచ్చిన నీళ్ళు పిల్లి పారబోసి మీకు యింట్లో మంచినీళ్ళు పుట్టకుండా చేసింది. మా ప్రసాదం వుద్యోగం సంపాదించి మా యింట్లోవాళ్ళకి వేళకి తిండికూడా పుట్టకుండా చేశాడు.

వీర : అతనికోసం భోజనం చేయకుండా కూర్చున్నారా. మీరంతా.

ఏడు : ఆ – కూర్చున్నాం. రోజూ కూర్చుంటాం గూడా.

వెంక: నడ్డి నీల్గిపోయేటట్టు చాకిరీ చేసేవాడు రాకుండా ఊరికే కూర్చునే మాకు ఏంతొందర.

ఏడు : (వీరభద్రయ్యతో) చాకిరీ చెయ్యటం లేదని ఆకలి మందగిస్తుందా చెప్పండి.

వీర : అహాఁ – యింకా ఎక్కువవుతుంది.

ఏడు : మొన్న ఒంటిగంటవరకూ వాడు రాలేదు. ఆకలికి నా ప్రాణం గడగడలాడిందంటే నమ్మండి. ప్రొద్దునే కాఫీఅన్నా లేదాయె కొంపలో – అయినా మా యిల్లు కాదుకాబట్టి వేరేం మాట్లాడ లేక ఊరుకున్నా.

జానకి: నీకు ఆకలేస్తుంటే రారాదా అన్నయ్యా–నడ్డిస్తాను. దానికోసం యింత యిదెందుకు ?

ఏడు : ఓ – పెడ్తానంటే రానంటానా.

వీర : ఆగవోయ్ ఏడుకొండలరావ్. ప్రసాదు వచ్చేవేళ యిందిగా...(ఏడుకొండల్ని ఆపి – కాస్త నీపుదువ్వి) వెంకట్రామయ్యగారూ – యిదివరకు నేను అడగటానికే సందేహించేవాణ్ణి–చూడండి – మనప్రసాదం వుద్యోగంలో చేరి పదిరాళ్ళు సంపాదిస్తున్నాడు. మీ పెన్షనూ వస్తూంది. గనక అద్దెకూడా కాస్త పెంచితే బాగుంటుంది.

వెంక: అద్దె పెంచమంటారా!

వీర : అందరూ అద్దె లెలా పెంచారో చూడండి. వ్రాళ్ళో.

ఏడు : నద్దు. పెంచొద్దు - చస్తే పెంచొద్దు. ఆ వంటగది గోడ బాగుచేయిస్తేగాని పెంచడానిక్కి నేను వప్పుకోను. (గట్టిగా అని - నెమ్మదిగా) ఎల్లాచావనూ యీ ఆకల్తో.

వీర : ఆకలంటావేమిటోయ్ మళ్ళా. యింతకు ముందేగా కాఫీహోటల్నుంచివస్తూ కనిపించావ్ బాగా మెక్కి.

ఏడు : కనిపించడానికి కనిపించా. కాని త్రాగింది వట్టి కాఫీయేగా.

వీర : ఊఁ - వట్టి కాఫీయేనా డబాయింపు...మరి ఏమంటారు వెంకట్రామయ్యగారూ! నేనేంతో పెంచమనడం లేదు. ఈ తడవకి ఒక్క నాలుగు రూపాయలు.

వెంక: ప్రసాదు రానీయండి వాడితో ఆలోచించి-

వీర : అలాగే కానివ్వండి. అందరికిమల్లే నేను తొందరపడే వాడ్ని కాను...పెంచుతారని మా ఆవిడతో చెప్పేస్తాను - ఊఁ.

ఏడు : యీ ప్రసాదుగాడు యింకా రాలేదేం.

జానకి: (లేచి - విసుగ్గా) రా అన్నయ్యా - నీకు వడ్డిస్తాను.

ఏడు : ఓ - అల్లాగే...(జానకి వెనకే వెడతాడు)

వీర : ఏమిటండీ. యీఏడుకొండలు-ఎన్నాళ్ళిక్కడ మకాం

వెంక: (దగ్గు వస్తుంది)

వీర : ఏదో చెప్పి సాగనంపక ఏమిటిది చాదస్తం కాకపోతే.

వెంక: అలా సాగనంపితే ఏం బాగుంటుంది.

వీర : బాగుండేదేమిటి, బాగు-మనబోటివాళ్ళకా మొహ మాటాలు. వెనకా ముందూ బాగా వున్న వాళ్ళయితే ఎవరెన్ని నెల్లువున్నా ఫర్వాలేదు.

(ప్రసాద్ వస్తాడు)

వెంక: యింత ఆలస్యమయిందేరా ?

ప్రసా: ఏకంగా జీతం తీసుకొద్దామని కూర్చుంటే యింత సేపయింది.

వెంక: జీతం తెచ్చావా ?

ప్రసా: తెచ్చావా తెస్తూనే ఖర్చు చేశా; యివ్వాల్సిన వాళ్ళకు యిస్తూనవస్తే మిగిలిందిదిగో, రెండు రూపాయల పద్ధాలుగణాలు. మళ్ళీనీ పెన్షన్ వచ్చేవరకూ యింట్లోయిదే.

వీర : నీకు వచ్చేది ఏభైరూపాయలుగాదూ ?

ప్రసా: వచ్చేదిగాదండి లెక్క - మిగిలేది.

వీర : కష్టమే కరువురోజులు గాదూ !

వెంక: లే - భోంచేద్దాం. జానకీ ! అన్నయ్యొచ్చాడు వడ్డించమ్మా.

వీర : ప్రసాదూ ! ఆ శంకరందగ్గర సైకంతీసుకొచ్చావా ?

ప్రసా: లేదండీ ! మర్చిపోయాను.

వీర : లే లే, సరేలే ... సరేలే ...

[తండ్రీకొడుకులు లోపలికి – వీరభద్రయ్య బయటకి వెడతారు. కాసేపటికి మూతి తుడుచుకుంటూ ఏడుకొండలు వచ్చి, పాటపాడుకొంటూ, తలదువ్వకొంటూ పాగావంకీల్ని ప్రసాద్ కోటువేళ్ళాడటంచూసి – తొడుక్కుని సరిచేసుకుని–ఎవరూ లేకపోవడం చూసి వెళ్ళిపోతాడు బయటకి.

మరికాస్సేపటికి వెంకట్రామయ్య చొక్కా తొడుక్కుంటూను – వెనక ప్రసాద్, జానకివస్తారు......ప్రసాద్ తలదువ్వకునివచ్చి వంకీల్ని కోటులేకపోవడం చూసి...]

ప్రసా: ఏదీ ? నా కోటేదీ ?

జానకి: ఎక్కడ తగిలించావ్ ?

ప్రసా: యిక్కడే ?

జానకి: ఏదీమరి ?......ఆఁ ఏడుకొండలు వేసుకెళ్లి వుంటాడు.

ప్రసా: బాగా నేవుంది. యీచిరిగిన చొక్కాతో ఎట్లా వెళ్ళను బయటకి ? ఛ ఛ – వెధవబ్రతుకు.

వెంక: అంత విసుక్కుంటా వేమిరా – విసుక్కుంటే ఉన్న దానికన్న ఎక్కువ ఎట్లా వస్తుంది.

ప్రసా: విసుక్కుంటే రాదు; ఎట్లా వస్తుందా అని కూర్చున్నా రాదు.

వెంక: కూర్చోక ఏంచేద్దామంటావ్ ?

ప్రసా: నే నన్నది చేస్తే యింకేం.

జానకి: వాడి ఉద్దేశ్యం మరేం లేదు నాన్నా... నన్ను చదివించి...

వెంక: ఉద్యోగంలో చేర్పించమనేనా......

జాన : అవును నాన్నా! థార్డుఫారం వరకూ చదివేనా - ఇప్పుడు ట్రెనింగులో చేరితే నెలకు నలభయ్యో, ఏభయ్యో వస్తాయి నాన్నా.

వెంక: బాగానే వుంది.

జాన : బాగుండటాని కేగా నాన్నా - యీ అర్థాకలితో ఎన్నాళ్ళని గెంటగలం. అందరం పనిచేసుకుని సుఖపడటం తప్పా?

వెంక: సుఖపడే రాతవుంటే యింతదాక ఎందుకు వచ్చేది.

జాన : వచ్చిన దానికేం చేస్తాం. యింట్లో వూరికే కూర్చునే కంటె, పనిచేసి కాస్త ఏదో తెస్తే బాగుంటుందికాని...

వెంక: (మాట్లాడడు - పైగా దగ్గుతెర)

జాన : ఆలోచించునాన్నా! నువ్వా పెద్దవాడివయావ్. జబ్బుతో కూడా పడిపోయావ్. నీఅనంతరం పెన్షనూ పోతుంది. ప్రసాదు తెచ్చే ఏభైరూపాయలతో వాడి పెళ్లి సంగతి అలా వుంచి మా యిద్దరి పొట్టలన్నా గడవాలా?

వెంక: (మాట్లాడడు)

జాన : వాడు పెళ్ళిచేసుకుంటే మనమీద పడుకొండలున్నట్లే వాడి సంసారం మీద నేనూ పడి బ్రతకాల్సిందేగా,

ఏడుకోండల్ని మనం అసహ్యించుకోన్నట్టే వాళ్ళు నన్నూ అసహ్యించు కోరూ.

ప్రసా: (యీ మాటకి కోపంవచ్చి) జానకీ!

జాన: నిన్నేం అనడంలేదన్నయ్యా!మాటవరుసకంటున్నాను. ఎంతమంది ఆడవాళ్ళు ప్రపంచంలో వుద్యోగాలు చేసుకోవడం లేదు నాన్నా! నా కర్మానికి మీరేం చెయ్యలేకపోయారు. దీనికన్నా వప్పుకో నాన్నా! వప్పుకుంటే నా జన్మ నిశ్చింతగా వెళ్ళమారిపోతుంది– వప్పుకో నాన్నా.

వెంక: నేను వప్పుకొనేదేమిటి – మీ యిష్టంవచ్చినట్లు ఏడవండి...(కాస్త విసుగ్గా, కోపంగా అంటాడు)

జాన: కోపంవచ్చిందా నాన్నా?

వెంక: కోపం ఎందుకమ్మా! ఏడవాల్సినప్పుడు.

జాన: నీకు కష్టంగా వుంటే చేరనులే నాన్నా,

వెంక: నాకు కష్టం ఎందుకు? నా చేతిలో ఏముందని – నా ఖాపల్లా వీధిలో నలుగురూ నవ్వుతారే అని.

జాన: నలుగురు నవ్వుతారని బాధెందుకు? ఆడవాళ్ళబడిలో ఆడవాళ్లు పనిచేస్తే ఎందుకు? నవ్వుతారు?

వెంక: నవ్వరూమరి. మన యిళ్ళల్లో ఎప్పుడన్నా యిలా వుద్యోగాలు చెయ్యడముందా? యింటా వంటాలేని పనిచేస్తే నవ్వరూ?

జాన : యింటావంటా లేదనీ. నలుగురూ నవ్వుతారనీ మనం సుఖపడటం మానుకుంటామా ? మన యింట్లో ఎప్పుడన్నా యీ దరిద్రంతో బాధపడటముందా? మన యిళ్ళల్లో పెళ్ళాల్ని వెళ్ళగొట్టడముందా ?

వెంక: లేవు గనక గౌరవ ప్రతిష్ఠలు మంటగలిపి అడదానివి పుద్యోగాని కెడతావా ?

జానకి: అయితే ఎన్ని కష్టాలకయినా వోర్చి ఆడది యింట్లో పడి వుండాలా? సరదాకి కాదుగా యిది చెయ్యడం. గౌరవంకోసమని. కడుపు మాడ్చుకుంటామా? కడుపు మాడ్చుకోవడం గౌరవమా గానం కోసం మన సుఖజీవనం త్యాగం చెయ్యడమా ?

వెంక. అదేమిటమ్మా ?

జాన : అంతేగా మరి - మనం యింట్లో తిండీలేక సూడితే మన గౌరవానికేం లోపం లేదు. అడది బయటికి వెళ్ళి నాల్గురాళ్ళు తెచ్చి కడుపునిండా తింటే తక్కువ గౌరవం. చిరుగ్గుడ్డల్తో యింట్లో పడుంటే మనకు ప్రతిష్ఠ. మంచి గుడ్డల్తో బయటికి వెడితే మన కప్రతిష్ఠ. ఈ గౌరవ ప్రతిష్ఠలకని మమ్మల్ని బాధ పడమంటావా?

వెంక: నేను బాధపడమన్నానా?

జా న : కాదా ?

వెంక: నేనా ? నేనా మీ సుఖానికడ్డం.

జాన : అంతేగా మరి ...

వెంక : కాదు—చేరవమ్మా—చేరు—నీకిష్టంవచ్చిన వుద్యోగంలో చేరు.

జాన : కోప్పడకు నాన్నా ... నీకిష్టమయితేనే చేరతాను.

వెంక : నాకిష్టమేనమ్మా ... నే నెప్పుడూ యిలా అనుకో లేదు. నేనా – నా బిడ్డల సుఖానికడ్డం – నేనా – నా పిల్లల కడుపు కాల్చేది ... అహాఁ – అలా వల్ల కాదు – చేరు – నీకు యిష్టంవచ్చిన వుద్యోగంలో చేరు.

జాన : (సంతోషంగా) అన్నయ్యా ...

ప్రసా: (సంతోషంగానే) జానకీ.

[యిద్దరూ తండ్రిని చుట్టబెడ్తారు ఆనందంతో–
ఏసుకొండలు వస్తాడు]

ప్రసా: నువ్వేసుకు వెళ్ళావా కోటు ?

ఏసు : ఆ – సరదాగా – ఎట్లావుంటుందోనని–అలా నాలుగు వీధులూ తిర్గివచ్చానురా.

ప్రసా: చాల్లే – విప్పు – నీకోసం కాచుకూర్చున్నా యింత సేపూ ...

ఏసు : ఏం ఎందుకూ ? వెళ్ళలేకపోయినావ్.

ప్రసా: ఎలా వెళ్ళను యీ చిరిగిన చొక్కాతో.

ఏసు : ఏం వెడితే – నీ బోడి వుద్యోగానికి కోటు తక్కువయిందేం ? ఏబై రూపాయల జీతానికి సెర్జుకోటు.

రోజుకు యిరవైగంటల చాకిరీ - సర్లే, తీసుకో;
ఆమాత్రం త్యాగం నే చెయ్యగలనులే.

[విసిరిన కోటు అందుకొని ప్రసాద్ వేసుకొంటూండగా]

జాన : ఆ గరల్ స్కూల్లో Untraine·i వాళ్ళకు కూడా
ఉద్యోగం యిస్తారన్నావుగా. కనుక్కో రాఅన్నయ్యా.

ప్రసా: అవును యిప్పుడే కనుక్కు వస్తానాగు___ (వెడతాడు)

ఏడు : ఏమిటదీ ?

జాన : ఏంలే. నేను వుద్యోగంలో చేరదామని...(లోపలికి
వెళ్తుంది)

ఏడు : (వెంకట్రామయ్యతో( వుద్యోగంలో ___ గరల్
స్కూల్లో ___ పంతులమ్మగానా ?

వెంక: ఆ – పంతులమ్మగానే___(విసురుగా లోపలికెళ్తాడు)

ఏడు : పంతులమ్మగానా ? – పంతులమ్మగానా ? (నవ్వి)
పంతులమ్మ – పంతులమ్మ (యింకా నవ్వి క్రమంగా
పాటలో కలుపుతూ)

పంతులమ్మ – పంతులమ్మ
పావు శేరు మెంతులమ్మ
యింతాలోకంలోన పంతులమ్మ
ఎగిరి గంతు లేసె పంతులమ్మ
ఎంతా జీతం నీకు పంతులమ్మ
పరువెంత భువిలో నీకు పంతులమ్మా,

[పాటపాడుతూండగానే వీరభద్రయ్య. సోమశేఖరం వచ్చి పాటవింటూ......]

సోమ: ఏమిటోయ్ పాటలు ?

వీర : ఏమోయ్ : ఏడుకొండలూ : మహా కులాసా గా వున్నావు.

[వీళ్ళను చూసి రెచ్చిపోయి మళ్ళీ మొదలెడ్తాడు పాట – పాట సాగుతుంటే వీళ్లిద్దరూ తాళం వేస్తూంటారు. బయటినుంచి ప్రసాద్. లోపల్నుంచి వెంకట్రామయ్య. జానకి వక్క–సారే వస్తారు. పాట సాగుతూనే వుంటుంది...]

ప్రసా: ఏమిటీగోల.

[అంతా కిమ్మనాస్తి]

వీర : మనవాడు పాట పాడుతున్నాడు.

జానకి: వాడు పాడుతుంటే మీరు తాళం వేస్తున్నారు.

సోమ: ఆఁ! ఆఁ! తాళం బాగా పడుతువుంటేనూ.

ప్రసా: తాళం వేస్తున్నారు. వాడేంపాడినా మీరు తాళం వేస్తారు కాబోలేం.

జానకి: వేస్తారు. అది తమవిషయం కానంతవరకూ,

వీర : మీరల్లా అనుకోవడం బాగాలేదు – ఈపాట మిమ్మల్నిగురించి అనుకుంటున్నారా ఏమిటి.

[యీ వాదనలో ఏడుకొండలు జారుకుంటాడు]

ప్రసా: కాక మరెవర్నిగురించి ? జానకి పంతులమ్మగా చేరుతుందనేగా యీ పాట.

సోమ: జానకి పంతులమ్మగా చేరుతుందా !

వీర : పంతులమ్మగానా ! ఛా ఛా.

జాన : ఆ – పంతులమ్మగానే చేరతాను. తప్పకుండా చేరతాను. ఏంచేస్తారో చేసుకోండి.

వీర : మీరే అట్లాఅంటే యిహ మేం చేసేదేముంది.

సోమ: మీ నాన్నగారే నవ్వుతుంటే యిక మాదేముంది.

వీర : చేరేవాళ్లు మీరు – ఆ బాగోగులు మీవి.

సోమ: మీయిష్టంవచ్చినట్టు మీరు వుద్యోగాల్లో చేరతారు లోకం నవ్వితే నవ్వుతుంది.

జాన : నవ్వుతుంది – నవ్వనీయండి – కావాలంటే మీరూ వాళ్ళతో కలసి నవ్వండి – కాని యిక్కడకాదు. బయటకుపోయి నవ్వండి – ఊఁ – పోండి.

సోమ: పోతాం – బయటకే పోతాం. పోయి నవ్వగలిగితే మేమూ నవ్వుతాం–ప్రపంచం అంతా నవ్వగాలేంది మేం నవ్వితే ఏం – (వీరభద్రయ్యతో) ఏమయ్యా ! యింకా ఎందుకూ – రా.

[యిద్దరూ వెళ్తారు. ప్రసాద్. వెంకట్రామయ్య, జానకి – తలల వంచుకుంటారు......బయటనుంచి పెద్దగా నవ్వులు విని పిస్తాయి...]

వెంక: నవ్వు తున్నారు – అందరూ మన్నిచూశి నవ్వుతున్నారు...అందరూ మన్నిచూశి నవ్వుతున్నారు.

[నవ్వులింకా వినిపిస్తున్నాయి–ఎక్కువయాయికూడా]

జానకి: (వివశురాలై) అన్నయ్యా! నాకిదేమీ వద్దురా—నాకే వుద్యోగం వద్దురా అన్నయ్యా.

వెంక: జానకీ.

ప్రసా: (ఓదారుస్తూ) కన్నీళ్లా జానకీ! అర్థంలేనిదమ్మా యీ లోకం. అర్థంకాని యీ ప్రజానీకాన్ని చూసి యీ దుఃఖం ఎందుకమ్మా! తనకేంసంబంధం లేకపోయినా లేని జోక్యం చేసుకుని యీ ప్రపంచం నవ్వుతుంది. ఆక్షేపిస్తుంది నీ బలహీనతే ఆధారం చేసుకుని విమర్శిస్తుంది. కేవలం విమర్శకోసమే విమర్శిస్తుంది. నిజానికి ఈ లోకంలో, ఈ సంఘంలో ప్రతివాడూ తనకుతాను మంచివాడే. కాని అందరూ కలిసిన లోకం వేయితలల రాక్షసి. ఆ వేయితలలూ కలసినప్పుడు వక్క తల గూడా వుపయోగించి ఆలోచించదు.

[నవ్వులు సాగుతూ బాగా ఎక్కువయ్యాయి]

మనల్ని చూసి నవ్వుతారు. ఒక్కమనల్ని చూసేం—ఎవర్ని చూసైనా నవ్వుతుందీ లోకం. ఎంతటి మహాత్ముణ్ణయినా చూసి నవ్వుతుంది; గేలిచేస్తుంది; పట్టలేక రాళ్ళు పెట్టి కొడుతుంది—మనిషికి, మనిషికీ భేదం లేదని. మనుష్యు లందరూ వకటేనని చాటి చెప్పినందుకు ప్రార్థన సభలో తుపాకితో కాల్చి చంపింది ఈలోకం మహాత్ముణ్ణి. భగవంతుడే తన సర్వస్వమని నమ్మి, చరించి, పూజించినందుకు వ్యభి

చారిణని దూషించింది. ఈ భ_క్తమీరాను; ఈ లోక మేనమ్మా!——సంఘంలో వున్న కుళ్లను వెలికితీసి కడుగుతూ నాటకం వ్రాసిన యీ 'ఇబ్సన్' నాటక క_ర్తను దేశంనుంచి బహిష్కరించింది. అలాగే క్రీస్తు. మహమద్‌లాంటి మత ప్రవ_క్తలను నానాబాధలు పెట్టింది. గెథే - సోక్రటీసుల్లాంటి మహామహుల్ని మట్టికరిపించిందీ లోక మే......(దుఃఖంతో) నిన్న గాక మొన్న మన మధ్యనేవున్న మహానుభావుడు; తెలుగు దేశానికి వెలుగునిచ్చిన మహా పురుషుడు; భారత దేశంలో కల్లా త్యాగవంతు డయిన సంఘ సంస్క_ర్త (టేబిల్ మీదున్న ఫొటో తీసి చూపిస్తూ) మన వీరేశలింగంగార్ని నిందలుమోపి, కోర్టుకు లాగి నానాబాధలు పెట్టింది-అంతటి అమరజీవుల్ని బాధిం చిందీ యీలోక మే-యీలోక మేమనల్ని చూసి నవ్వు తోంది. నవ్వనీ. సామాన్యులం మన మాట లెక్క- మిటి - (నవ్వులు ఆగాయి) - నాకు తెలుసు ఆగు తాయని.

వెంక: జానకీ! ఏంచేద్దాం అమ్మా?

జానకి: ఏంచేద్దాం నాన్నా?

వెంక: చేరు. వుద్యోగంలోచేరు. మరేంఫర్వాలేదు. ప్రపంచం యీ మాటవినగానేనవ్వి గేలిచేసింది. వేరేం చెయ్య లేకపోయింది. నాచేతిల్లోనే వున్న యీఆయుధాన్నిం

తవరకూ కనిపెట్టలేక పోయూ. - నా చేతిలో నేవుంది. యీా ప్రపంచాన్ని జయించ గలిగే ఆయుధం. యిహ నన్నెవ్వరూ ఏం చెయ్యలేరు.

ప్రసా: అంతే - అలవాటైన ఒకమార్గంలో అందరూ పోతూంటూరు. కొత్తమార్గం చూపించినా మొదట అందరూ రాలేరు. కొంతమంది తెగించి ముందుకుపోతేకొంచెం వెనకాముందుగా అందరూ అటే వస్తారు. ప్రంపంచం అంతా మన్ని చూసి నవ్వింది. ఇంతవరకూ -యిహ మనం ప్రపంచాన్ని చూసి నవ్వుదాం - రా, జానకీ. స్కూల్లో నీకు వుద్యోగం యిస్తానన్నారు.

జాన : నిజంగానా !

ప్రసా: ఆ - రేపట్నుంచే రమ్మన్నారు.

జాన : అయితే మన కష్టాలు గట్టెక్కినట్టే.

ప్రసా: హాయిగా, సుఖంగా, జీవనం సాగించవచ్చు. సంతోషంగా బ్రతకవచ్చు. బరువు తగ్గిన హృదయాల్తో నవ్వుదాం; మనస్సు బరువు తగ్గేదాకా -

వెంక: ప్రంపంచాన్ని చూసి నవ్వగలం - ప్రపంచంకోసం ఏడ్వనూగలం - కాని ప్రపంచాన్ని విస్మరించి జీవించ గలమా అని.

ప్రసా: యింకా అనుమానమా నాన్నా.

వెంక: ఏమో - నాకింకా అనుమానంగానే వుంది,

ప్రసా: అనుమానమేం అక్కర లేదు. మనం నవ్వుతూ ముందుకు పోగలం. ముందుకుపోయి వెనకవాళ్ళను చూసి నవ్వుదాం – అప్పుడు వాళ్లేవస్తారు మనతో బాటు.

[ఏడుకొండలు వచ్చి – చివరిమాట విని]

ఏడు : ఎవరొస్తార్రా – వాళ్ళప్పుడే పోతేనూ.

ప్రసా: (ఒక్క నిమిషం ముఖంచూసి చిన్నగా నవ్వి, జానకి వైపు చూస్తాడు)

జాన : (అన్న అందించిన నవ్వుతో కలుపుతూ తనూ నవ్వుతుంది)

ఏడు : ఎందుకే నవ్వుతావు.

[యిహ వుండబట్టలేక విరగబడి నవ్వుతారు]

ఏడు : (ఉడుకుబోత్తనంతో) ఎందుకర్రా.

[గట్టిగా నవ్వుతారు]

ఏడు : (తెల్లబోయి) ఎందుకు బాబాయివీళ్ళునవ్వుతున్నారు.

[అంతవరకూ నవ్వని వెంకట్రామయ్య కూడా యిప్పుడు నవ్వుతాడు]

ఏడు : (యిహ ఏడ్పు మొహంపెట్టి) నువ్వూ నవ్వుతున్నావా బాబాయి.

[ముగ్గురూ నవ్వుతుంటారు – ఏడుస్తూ ఏడుకొండలు చతికిలబడ్తాడు – కాని వెంకట్రామయ్య నవ్వు క్రమంగాదగ్గు తెరగా కమ్ముకొస్తుంది. జానకి, ప్రసాద్ పట్టుకుంటారు...]

— తెర —

## నాల్గవ రంగం

[స్థలం–అదే గది. అంతా మామూలే. కాని మంచం కింద పీకిదానా, తాటాకువిసనకర్ర ప్రత్యేకం – టేబిల్ పై ఒకటి రెండు మందుసీసాలు–వెంకట్రామయ్య మంచంమీాద పడుకుని వుంటాడు. గడ్డం మాసింది. మొహం బాగా పీక్కుపోయింది. ఆయాసపడుతూ 'జానకీ' అని పిలుస్తాడు. ఎంతో బాధగా]

జాన : (వచ్చి) ఏం నాన్నా ?

వెంక: ప్రసాద్ రాలా ?

జాన : (ఆందోళనతో) ఎలావుంది నాన్నా ?

వెంక: గుండెదడ, ఆయాసం ఎక్కువగా వుందమ్మా ... ప్రసాదు రాలా ?

జాన : వచ్చేవేళయింది నాన్నా. వస్తాడు.

వెంక: మిట్టమధ్యాహ్నం అయింది. యింకారాలేదేం ?

జాన : వాడ దేపనిగా పనిచేస్తున్నాడు; వేళకి తిండికికూడా రాకుండా.

వెంక: అలా పనిచేసి నా మొహాన పోస్తున్నాడు. ఎందుకమ్మా నాకీ మందులు? వచ్చేది తిండికే చాలకపోతే నాకీ మందులు కూడా ఎందుకు? హాయిగా మరణిస్తే మంచిదికాదూ ?

జాన : వూరుకో నాన్నా ! యీా బెంగలతో మరీ ఎక్కువవుతుంది.

[ఏడుకొండలు హడావిడిగా వస్తూనే]

ఏడు : ఈవాళ వెళ్ళిపోతున్నా జానకీ! త్వరగారమ్మని అమ్మ దగ్గరనుండి వుత్తరం వచ్చింది. (అంటూనే తనవి, యితర్లని బట్టలు సర్దుకోవడం మొదలెడతాడు)

జాన : అంత తొందరేమొచ్చింది.

ఏడు : ఏమొ – అదీ వ్రాయలేదు. త్వరగా రమ్మని వ్రాసింది.

జాన : త్వరగా రమ్మని యిదివరకే చాలాసార్లు వ్రాసిందిగా.

ఏడు : అహఁహ – యీ తడవ మామూలుగా వ్రాయటం గాదు. యిది త్వరగా వ్రాసిన వుత్తరం.

జాన : కాని. అన్నయ్యా! వున్నవాడివి ఎలాగూ వున్నావ్. నాన్నకి జబ్బుగా వుంది. కాస్త మందు తెచ్చిపెట్ట డానికయినా వుంటావ్. యీ నాలుగురోజులూ వుందూ.

ఏడు : అమ్మమ్మా – వీల్లేదు; ప్రసాదు వున్నాడుగా వాడు తెస్తాడులే.

జాన : వాడికా పనిలో చేరిందగ్గరనుంచి తీరికే రావడం లేదు. నిన్న సాయంకాలానిగ్గాని మందు తేలేదు.

ఏడు : వెధవ యాభైరూపాయల వుద్యోగానికి వాడింత రాత్రిం బగళ్ళు కొట్టుకొంటూన్నాడేం ?

జాన : వీడో కష్టపడితే నాలుగురాళ్ళు ఎక్కువ దొరకు తాయికదా అని,

ఏడు : ఆc – గొరకుతాయి—వాడే ఏదో తీరిక చేసుకుని తెస్తాడులే మందు.

[బట్టలు సంచి, పరుపు చుట్టబెట్టడం వగైరాలు సర్దుకోవడం పూర్తయింది.]

జాన : వెళ్ళక తప్పదా ?

ఏడు : వెళ్లాలమ్మా! అప్పుడే ఆర్నెల్లయిపోయింది. యింకా ఎన్ని రోజులని వుండను;· యీ కష్టాల్లో నా భారం కూడా మీకెందుకు.

జాన : నాన్నా ! కొండలరావన్నయ్య వాళ్ళ వూరెళ్లిపో తున్నాడు.

వెంక: ఏడుకొండలా ? వెళ్లుతున్నావట్రా ?

ఏడు : మరే బాబాయ్ ! అమ్మరమ్మని వ్రాసింది; వెళ్తున్నా ఉత్తరాలు వ్రాస్తూండమను ప్రసాద్‌ని. నే వెళ్ళొ స్తాను – నీ జబ్బు నయమయాకా వస్తాలే. (సంచీ, పరుపుచుట్ట చంకను బెట్టుకొని) వెళొస్తా జానకీ ! వెళొస్తా బాబాయ్ !

[ వెళ్తాడు – కాసేపు నిశ్శబ్దం]

వెంక: అమ్మా ! ప్రాసాదు వచ్చాడా ?

జాన : యింకా రాలేదు నాన్నా !

వెంక: యీాదడ రొప్పు ఎక్కువవుతున్నాయి. [illegible] చాలా విపరీతమైన బాధగా వుంది.

జాన : (ఆందోళనతో బయటకు వెళ్లి చూచి) అదుగో అన్నయ్యగారూడా వస్తున్నాడు.

వెంక: వస్తున్నాడా ? వస్తున్నాడా ? రానీవాణ్ణి- దగ్గరుంటే ప్రాణాలు తేలిగ్గా వదలగలను.

[ప్రసాదు సోమశేఖరం కలిసి వస్తారు]

ప్రసా: (వచ్చి) ఎలా వుంది నాన్నా ?

వెంక: వచ్చావా ?

సోమ: (ప్రసాద్ వెనకనే వచ్చి) మీ నాన్నగారికి యింకా ఎక్కువగానే వుందేమిటి ?

ప్రసా: ఎక్కువగానే వుందండి.

సోమ: అయ్యో! నే తగ్గిందనుకున్నా - బాగా ఆయాసపడుతున్నారే. వెంకట్రామయ్యగారూ! ఎలావుంది ?

వెంక: యిదిగో ! యిలాగే వుంది.

సోమ: పాపం. మందు తీసుకుంటూన్నారా ?

ప్రసా: ఆ - జానకీ! ఏడుకొండలచేత మందు తెప్పించమన్నాను- తెచ్చాడా ?

జాన : లేదు.

ప్రసా: ఏం ?

జాన : వాళ్ళమ్మ కమ్మనమని వుత్తరం వ్రాసిందట - వెళ్లిపోయాడు ఉండమంటున్నా వుండకండా.

ప్రసా: అంత తొందరేమొవచ్చింది ?

సోమ: మరేం లేదు. సుఖంగా గడిచినంతకాలం వున్నాడు. కష్టాలు వచ్చాయి గనక జారుకున్నాడు.

జాన : నాన్నకు జబ్బు నయమయాక ఉత్తరం వ్రాస్తే వస్తా నన్నాడు.

ప్రసా: ఎందుకు ? తిని పెట్టడానికా ?

సోమ: ప్రసాదూ ! మందెవరిస్తున్నారు.

ప్రసా: డాక్టర్ సుందర్రావు

సోమ: ఛ ఛ – ఆయనా ? ఆయనేం లాభం లేదు. డాక్టర్ రాజారాం గారి దగ్గరయితే మంచిది. రేపట్నుంచి ఆయన దగ్గరిప్పించండి (కాస్త మంచందగ్గరగా వెళ్ళి పరామర్శించి, కూర్చుని) వెంకట్రామయ్యగారూ ! నిన్న మావాళ్లింటిదగ్గర మీ అల్లుడు కన్పించాడు. సంగతేమిటో కనుక్కుందామని నేనే కదలేశా.

వెంక: ఏసంగతి ?

సోమ: అదే; మనజానకి సంగతి.

వెంక: జానకి సంగతా – ఏమన్నాడు ?

సోమ: ఏదో – చాలాసోది చెప్పాడు. అతనిమాట అతను చెప్పాడనుకోండి. చివరికి...

ప్రసా: ఆఁ చివరికి – ?

సోమ: జానకికే కాపరంచేయడం యిష్టంలేదన్నట్లు తేల్చాడు.

వెంక: జానకికా ?

సోమ: ఆ – జానకికే. ఏదో ఆవేళకోపంవచ్చి కొట్టానను

కొండి; కాస్తపెద్ద దెబ్బే తగిలిందనుకోండి; అంతలోనే అలా లేచిపోయి - యిలావుద్యోగంలో చేరుతుందా? అన్నాడు.

ప్రసా: ఆవేళ దెబ్బలు మీరు చూశారుగా.

సోమ: అదిసరే ఆవేళఅలావచ్చేసినందుకు మరీకోపంవచ్చింది.

ప్రసా: ఆకొట్టడం ఏ ఒక్కనాడో అయితేవుండి కాపరం చేసేదే.

సోమ: అవన్నీ అలావుంచు; మీతరపున నేనూ చాలావాదించాను. నువ్వేలుకుంటానంటే జానకిని పంపుతారనీ నేనూ - వాళ్లుపంపుతే ఏలుకొంటానని అతనూ - యిలా చాలాసేపు వాదించుకున్నాం. చివరికి మీ చేతనయితే రేపు పంపించమనండి; ఏలుకోక నేనేం చేస్తాను - అన్నాడు.

ప్రసా: మేం పంపనన్నామా? నాన్నగారు వెళ్ళి బ్రతిమాలితే ఈయన్ని గూడా కొట్టారుగా.

సోమ: ఆఁ - అది ప్రథమకోపంలో వళ్ళెరగక కొట్టాడులే.

ప్రసా: కోపంలో వళ్ళెరగకకొడితే దెబ్బ నెమ్మదిగా తగలదండీ.

సోమ: ఎలాగోఅల్లా వప్పుకున్నాడు. కాబట్టి నేననేది విని - అమ్మాయిని పంపండి.

ప్రసా: పంపితే యిక కొట్టకుండావుంటాడని నమ్మకమేమిటి,

సోమ: అదేమిటోయ్. మొగుడు పెళ్ళాలు అయింతర్వాత దెబ్బలాడుకోకుండా ఎలావుంటారు.

వెంక: ఎందుకురా మొండివాదనలు. జానకీ – బయలుదేరిపో అమ్మా.

ప్రసా: వెళ్తుంది లెండి. మీజబ్బు నయమయింతర్వాత. సోమ శేఖరంగారూ – చూస్తూన్నారుగా నాన్నగారి పరిస్థితి భగవంతుడు దయవల్ల కాస్త నయమయింతర్వాత పంపుతాం లెండి.

సోమ: అహాఁహా. అతనుయివ్వాళే పంపాలన్నాడు.

ప్రసా: యివ్వాళే :

సోమ: ఆఁ–యివ్వాళే పంపాలన్నాడు. యివ్వాళ పంపకపోతే అసలు భార్యేఅక్కర లేదన్నాడు.

ప్రసా: యిలా మా నాన్నగారికి జబ్బుగావున్నా–

సోమ: ఆఁ–నేనదీ అన్నా. ప్రాణం పోతున్నాసరే పంపితే యివేళే పంపాలన్నాడు.

ప్రసా: ఎవరినుద్దరించ డానికండీ యీాయన కాపరం చేయడం.

వెంక: ఎందుకొచ్చిందిది. నువ్వెళ్ళమ్మా జానకీ.

ప్రసా: యివ్వాళ మేము పంపకపోతే.

సోమ: పంపకపోతే ఏముంది – యిక ఎప్పుడూపంపనక్కరే లేదు.

ప్రసా: అంటే !

సోమ: అంటే ఏముంది. కోర్టులో దావాచేసి - వివాహ విచ్ఛిత్తి చేసుకుని - వేరే వివాహం చేసుకుంటాడు.

వెంక: మొండివాదనలు చెయ్యకు ప్రసాదూ - సంఘానికి అంత ఎదురు తిరిగి జీవించలేంరా. పో - బండి పిల్చుకురా.

ప్రసా: నువ్వూరుకోనాన్నా. సోమశేఖరంగారూ -మీరు వెళ్లి పంపరట. వేరే వివాహం చేసుకోవచ్చని చెప్పండి.

వెంక: అదేమిటిరా ?

ప్రసా: ఆయన మమ్మల్ని వుద్ధరించాలని పెళ్ళి చేసుకోలేదు. పెళ్ళి చేసుకోవడం పెళ్లాన్ని చావబాదడానికాదు అని కూడా చెప్పండి.

సోమ: అబ్బాయ్ ! వు్రదేకంలో నువ్వు వున్న ఆశ కాస్తా పాడుచేయకు; అసలే అతను రేచిక్కమనిషి.

ప్రసా: అతని రేచిక్కతనినే వుంచుకోమనండి. మా జానకి తనపొట్ట తనే పోషించుకోగలదు.

సోమ: పోషించుకోగలదని - ఆడబిడ్డల కాపరాలు చెడగొట్టు కోడు. ఎవ్వరూ.

ప్రసా: మేం చెడగొట్టామూ ? పెళ్లాం నేలుకోవడం చాతకాక అతనే చెడగొట్టుకున్నాడా ?

సోమ: సరే, ఆ మాటలే చెబుతాను- ఏ మమ్మా ! యిలానే చెప్పమంటావా ? - నూకేం ? మేం పైవాళ్ళం - కాపరం నీది.

జాన : ఏమని చెబుతారు ?

సోమ: యిక కాపరానికి రాదని.

జాన : సరిగ్గా అలాగే చెప్పండి.

వెంక: జానకీ !

జాన : కాపరం కాదది – కఠిన నరకం. అంతకంటె కాటికి సంతోషంగా వెళ్ళొచ్చు.

సోమ: సరే. మీ అందరికీ యిష్టం లేకపోతే నాకీ బాధెందుకు ? లోకం కోసమన్నా కాస్త వెరుస్తారనుకొన్నా.

జాన : దెబ్బలు, తిట్లూ తినేది నేనుకాని, లోకం కాదండీ.

ప్రసా: అన్యాయంగా కొట్టి చంపే అతనికిలేని వెఱపు మాకెందుకండీ.

జాన : ఆడపిల్లనికన్న ఏ హృదయం నన్నీ ప్రపంచంలో నిదించదు.

ప్రసా: నిదించినా సరే. పూటకో ముద్దకోసం ఆయింట తిట్లు తింటూ పడి వుండాల్సిన అవసరం లేదు.

జాన : సంగతి సందర్భాలు తెలుసుకోకుండా నన్ను నిందించడమే ప్రధానంగా లోకంలో ఎవ్వరయినా పూనుకుంటే వాళ్ళని నే నాట్టే లక్ష్యపెట్టను.

ప్రసా: దాని కాపరమంటే అంతశ్రద్ధగల ఆ లోకాన్ని కట్టకట్టుకుపోయి అతనికింత గడ్డి పెట్టమనండి.

సోమ: సరే. యిదంతా నాకెందుకు - యీ మాటలే చెబు తాను. వేరే పెళ్ళి చేసుకుంటాడో - మరేం చేసు కొంటాడో.

ప్రసా: అది నేనూ చూస్తాను. జానకి కన్నీళ్ళను చూస్తూ ఎవరు తన పిల్లనిస్తారో చూస్తాను.

సోమ: ఓస్! చాలామంది యిస్తారు. మీరూ మీరూ ఏం చేసుకున్నా సరే - నా కెందుకు? వస్తా.

ప్రసా: మరి వెళ్ళి అతనితో యీ మాట చెప్పరూ?

సోమ: అది మాత్రం నా కెందుకు? అతనేమయితే నా కెందుకు? మీ అమ్మాయి నేంజేసుకుంటే నాకెందుకు?

ప్రసా: అతన్ని పెళ్లి జేసుకోమనండి. మా జానకి యిలాగే వుంటుంది. లేదా......

సోమ: అబ్బాయ్! యిక ఎవరేం జేస్తే నాకేం? ఏదో పెద్దవాడూ - ఆయన బ్రతికుండగా మాట వినక పోతారా అవి చెప్పానుగానీ.

వెంక: సోమశేఖరంగారూ! నా పనయిపోయిందండి-ఆయాసం ఎక్కువవుతోంది. యివేళో - రేపో హరీ అనబోతు న్నాను. యిహ బ్రతికి బట్టకట్టవలసినవాళ్ళు వాళ్లి ద్దరూ......ఏది ఎల్లా అయినా అనుభవించవలసిన వాళ్ళు వాళ్లు. మనదేముంది - అంతా వాళ్ళ యిష్టం.

సోమ: మీరూ అలాగే అంటే యింకేముంది అనడానికి.

వెంక: యిప్పటివరకూ నేనూ మీలాగే అన్నాను. కాని జానకి మొహం. జానకి మాటలు చూసి వేరే విధంగా అన లేకబోతున్నాను.

సోమ: సరే – అలాగే – మీయిష్టం.

వెంక: అహాఁ! అంతా వాళ్ళ యిష్టంకనక మీరేం కల్పించుకోనవద్దని నా ప్రార్థన.

సోమ: అలాగే! నాకేం బట్టె వెళ్ళొస్తా–వెళ్ళొస్తానోయ్!

ప్రసా: శీఘ్రంగా.

[సోమశేఖరం వెళ్తాడు]

వెంక: అమ్మా – జానకీ! జన్మాంతం యీ అసమర్థుణ్ని నిందించినా సరే మీ యిష్టంవచ్చినట్లు మీరు జీవించండి —— నా కాయాసం ఎక్కువవుతోంది.——ఒక్కసారి ఒక్కసారినా దగ్గరగా రండి...ప్రసాదూ! యీ గుండెలమీదపడుకో. జానకీ! ఇంకాదగ్గరగారాఅమ్మా! ......ఓహో! ఎంత హాయిగా వుంది! యిప్పుడే ప్రాణంపోతే నేనెంత అదృష్టవంతుణ్ణి – ప్రసాదూ! నా గుండెల్ని కౌగలించుకో; నా విరిగిన రక్తం. చితికిన శక్తి పూర్తిగా పీల్చుకుని చిరకాలం జీవించండి.

జాన: మాట్లాడకు నాన్నా! మాట్లాడితే ఆయాసం మరీ ఎక్కువవుతుంది.

[సోమశేఖరం వెళ్ళగానే బయట గాలి, వాన ప్రారంభమవుతుంది. క్రమంగా అది ఎక్కువవుతూంటుంది.]

వెంక: ఎక్కువవనీ – ఎక్కువై – ఎక్కువై ప్రాణాలు తీస్తుంది. అంతేగా, నేను చచ్చైనా మిమ్మల్ని సుఖ పెట్టగలిగితే హాయిగా వుండేది ... ప్రసాదూ! నేను వుత్త స్వార్థపరుణ్ణిరా! ఆ ప్రపంచంలో శాశ్వతంగా సుఖపడడానికి వెడుతున్నా...

[వెంకట్రామయ్య బాగా ఎక్కువగా రొప్పుతూం టాడు. పిల్లలిద్దరూ తండ్రిమీదపడి ఏడుస్తూంటారు...

బయట హోరుగాలి, మధ్య మధ్య ఉరుములు – మెరుపులు విసురుగా వానజల్లు ఎక్కువై పోతాయి. కిటికీలు తలుపులు కొట్టుకుంటాయి ...

వీటన్నిటితో వీరభద్రయ్య వస్తాడు.]

వీర : ప్రసాదూ – ప్రసాదూ – ఏమిటీ. (వెంకట్రామయ్యను కాస్తపరికించి) వెంకట్రామయ్యగారూ – వెంకట్రా మయ్యగారూ... ప్రసాదూ – నాన్నగారికి ఆయాసం ఎక్కువవు తూన్నట్టుందే.

ప్రసా: మరే : డాక్టరును పిల్చుకువస్తాను. మీరు కొంచెం చూస్తూవుండండి. (వెళ్ళబోతాడు)

వీర : (తనూ వెనకనే వెళ్ళి ఆపి) మాట, ప్రసాదూ-
(కొంచెం ఉండుఅన్నట్టుసౌంజ్ఞచేసి, వెంకట్రామయ్యా
నాడికాస్త చూచివచ్చి ప్రసాదుదగ్గర నిలబడ్తాడు)
మాట్లాడడు.

ప్రసా: ఏమిటండీ ?

వీర : యిహా...బ్రతుకుతాడని తోచదోయ్...ఎందుకైనా
మంచిది...

ప్రసా: ఏంచేయమంటారు ?

వీర : ...అరుగుమీదకు తీసుకువెడితే – బాగుంటుంది.

ప్రసా: (ఏం మాట్లాడడు)

వీర : త్వరగా – తర్వాత విచారించి లాభంలేదు.

ప్రసా: బ్రతికివుండగానే ? యీ గాలివానలో చేతులారా
బయటపెట్ట మంటారా ?

వీర : ఆఁ – మరి లోపలపోతే ?

ప్రసా: అలాగే – అలాగే బయటపెడ్తాం. మీయిల్లిది.

వీర : ఎవరిల్లయితే మాత్రం – యింట్లోవుండగా ప్రాణిని
పోనిస్తామా చెప్పు ?

ప్రసా: అవును. యింట్లోవుండగా ప్రాణిని పోనివ్వరు. యింట్లో
వుండిగామనిషిని బ్రతకానివ్వరు. స్వంత యింట్లో
గూడ స్వంతప్రాణం వదలడానికి వీల్లేనిసంఘుంయిది.
ఎంత సంపాదించి – ఎంత యిల్లు కట్టుకున్నా చిట్ట
చివరికి – యే చెట్టుక్రిందో యేచూరుక్రిందో ప్రాణం

వదలాలిసిందే. ప్రతివాడు బ్రతికుండగా ఎంత ప్రేమ నటిస్తారో – చస్తాడని తెలియగానే అంత నీచంగా తోసేస్తారు. ప్రాణికి ప్రాణంమీద దయ లేదు. దేహానికి దేహంమీద విశ్వాసం లేదు. ఓ – ఏం ప్రపంచం యిది.

వీర : (కోపం వస్తుంది) యీ వేదాంతాని కేమి లేవోయ్– అరుగుమీదకు చేర్చండి త్వరగా.

ప్రసా: అలాగేనండి – అలాగే నాన్నా చూశావా–నువ్వు యింతవరకూ ఎంతో అడకువ చూపిన లోకం – ఏమంటూందో చూశావా... ఏ లోకం అంటే భయంతో వణికిపోతూ – ఏ సంఘపు వరవడిలో నీ జీవిత చక్రాన్ని తప్పకుండా పోనిస్తూ – జీవితాంతం వరకూ బాధపడ్డావో – ఆ సంఘపు కట్టుబాట్లు నీ అంత్య దశలో నీ కెంత సహాయం చేస్తున్నాయో చూశావా...ఏ సమాజాన్ని నువ్వువిశ్వసించి పూజించావో – ఆ సమాజానికి నీ మీద యెంత అసహ్యమో చూశావా, ఏ సంఘంకోసం నీ స్వేచ్ఛనీ – ధనాన్ని – వ్యక్తిత్వాన్ని – త్యాగం చేశావో – ఆ సంఘానికి నీ దేహంమీద ఎంతకృతజ్ఞతో చూశావా ఏలోకం – ఏ సంఘం – సమాజం – నిన్నూ నీ జీవితాంతం వరకు యీ సంసారాన్ని – యీ ప్రపంచానికి కట్టబెట్టి నీ జీవితాన్ని తన యిష్టంవచ్చినట్టు

యిన్నాళ్ళూ యేలుకుందో... ఆలోకమే – ఆసంఘమే నిన్ని అంత్యదశలో – యీ గాలివానలో వాకిలి దాటి బయటికి పొమ్మంటోంది. చూశావా – చూశావా – నాన్నా.

[ప్రసాద్ తండ్రిమీదపడి దుఃఖిస్తూంటాడు. వీరభద్రయ్యలో ఏదో కాస్తకదలిక వచ్చి ఊగుతాడు – కాని...]

జాన : లే – అన్నయ్యా – లే – బయటకు పడదాం. పట్టు–పట్టడానికి మనిద్దరికన్నా ఎవరున్నారు – మరెవరున్నారు...

[జానకి తననుచూచి యీమాట అనగానే విసురుగా వెళ్తాడు వీరభద్రయ్య ... ]

[ప్రసాద్ లేస్తాడు – ఆప్రయత్నంలో వుంటారు...]

(తెర జారుతుంది)

సమాప్తం.

# డాక్టరు : కొఱ్ఱపాటి గంగాధరరావు గారి

## నా టి క లు—నా ట క ము లు

1. భవబంధాలు
2. తెలుగుకోపం_బంగారు సంకెళ్లు
3. నిజరూపాలు
4. ఆత్మీయులు సాంఘికనాటకం
5. బ్రహ్మచారి
6. వైకుంఠం
7. లోకంపోకడ
8. విషకుంభాలు
9. సంక్రాంతి
10. భయం_అనార్కలి
11. ప్రార్థన_డిటెక్టివు
12. పరోపకారం
13. తస్మాత్ జాగ్రత
14. కమల
15. తెలిలో_తెలి
16. అందం_ఆనందం
17. అవునా! కాదా! మనసులోని మథన_ఎందరో మహానుభావులు
18. విధివశం_పవిత్రసంకల్పం
19. నాబాబు పెళ్ళిచూపులు
20. శకుంతల_విషకన్య శాంతిమయి
21. స్వయంవరం_కలత - సమ్మతిదే భగవాన్
22. సాహసి
23. పోటీ నాటకం
24. తోడు దొంగలు - నిరపరాధులు
25. గులాబీ ముళ్ళు_విగతి
26. రాగద్వేషాలు
27. మరా మనిషి
28. సమ్మతిదే భగవాన్
29. తనలో తాను
30. కళ్ళద్దాలు_పిలువని పరదేశి
31. నాలుగూ_నాలుగూ_నలభైనాలుగు (నవల)
32. పిల్లల నాటికలు
33. రతివిజ్ఞానం
34. గ్రుడ్డిలోకం
35. జైహింద్ - ప్రజా యుద్ధం కళాకార్
36. మనదేరాజ్యం
27. విశ్రాంతి

ఒక్కొక్కటి రూ 1_50

# నా ట క శి ల్పం

## రచన "రోహిణి"

వెల రు 2-00

## "నాటకశిల్పం" గూర్చి ఒక అభిప్రాయం

నేడు సరదాగా నాటకాలు వేయడానికి అన్ని వృత్తుల్లోవారూ సంసిద్ధులవుతున్నారు. చాలమంది ఔత్సాహికులు ఏ ఆఫీసులో చూసినా ఏ కాలేజీలో చూసినా కనిపిస్తారు. ఉత్సాహంతో ఒకసారి నాటకం వేసినా తర్వాత వీరిలోనే మళ్ళీ జన్మలోపాత్రధారణ చేయనివారు చాలా మంది కనుపిస్తారు. వీరికిఅనుభవం కావాలంటె కొన్నినాటకాలు వేయాల్సి వుంటుంది. ఆ శ్రమ అక్కర్లేకుండా ఈ పుస్తకం చాలామట్టుకు సహాయ పడ్తుంది.

చాలాసార్లు నాటకాలువేసి అనుభవముందని అనుకుంటూ అనుభవం వల్ల సరిదిద్దుకునే సావకాశం లేనివారికి కూడా ఈ పుస్తకం బాగా వుప యోగ పడ్తుంది.

వృత్తిగా నాటకంవేస్తూ సమాజం నిర్వహించకపోతె మానె రంగు వూసుకోవడం కూడా చేతకాకుండా కాలంగడుపుతూ వున్న వృత్తి నటు లకు గూడా యిది బాగా వుపయోగ పడ్తుంది.

ఇటువంటి సాధకబాధకాలన్నీ పడ్తున్న. నాకుకూడా యిది వుప యోగపడిందని సవినయంగా చెప్పుకుంటున్నాను.

రంగరచనా ప్రవీణ

**డా॥ కొర్రపాటి గంగాధరరావు. (బాపట్ల)**

# తెలుగు నాటకరంగ చరిత్రలో షష్టిపూర్తి రచనలు గావించిన

# డాక్టరు: కొర్రపాటి గంగాధరరావుగారి

## నాటికలు నాటకములు

| | |
|---|---|
| భవబంధాలు | 1-50 |
| తెలుగుకోపం బంగారు సంకెళ్ళు | 1-50 |
| నిజరూపాలు | 1-50 |
| ఆత్మీయులు (సాంఘికనాటకం) | 1-50 |
| బ్రహ్మచారి డిటో | 1-50 |
| వైకుంఠం | 1-50 |
| లోకంపోకడ (లలిత కళా నికేతన్‌లో ఉత్తమ రచనకు బహుమతి పొందినది) | 1-50 |
| విషకుంభాలు | 1-50 |
| సంక్రాంతి | 1-50 |
| భయం-అనార్కలి | 1-50 |
| ప్రార్థన-డిటెక్టివు | 1-50 |
| పరోపకారం | 1-50 |
| తస్మాత్ జాగ్రత్త | 1-50 |
| కమల | 1-50 |
| తెరలో తెర | 1-50 |
| అందరి ఆనందం | 1-50 |
| అవునా! కాదా!-మనసులోని మథన-ఎందరో మహానుభావులు ! | 1-50 |
| విధవశం - పవిత్ర సంకల్పం | 1-50 |
| పూలదోసిళ్లు | 1-50 |
| నాబాబు-పెళ్ళిచూపులు | 1-50 |
| శకుంతల - విషకన్య - శాంతిమయి | 1-50 |
| స్వయంవరం - కలత / సన్మతిదే భగవాన్ | 1-50 |
| సాహసి | 1-50 |
| పోటీనాటకం (లలిత కళా నికేతన్ నర్సపూర్ నాటక కళాపరిషత్తులలో ఉత్తమ రచనకు బహుమతి పొందినది) | 1-50 |
| తోడుదొంగలు - నిరపరాధులు | 1-50 |
| గులాబీముళ్లు - వికృతి | 1-50 |
| రాగద్వేషాలు | 1-50 |
| మరో మనిషి | 1-50 |
| సన్మతిదే భగవాన్ | 1-50 |
| తనలో తాను | 1-50 |
| కళ్ళద్దాలు- పిలువని పరదేశి | 1-50 |
| నాలుగూ-నాలుగూ-నలభై నాలుగు (నవల) | 1-50 |
| పిల్లల నాటికలు | 1-50 |
| రతి విజ్ఞానం | 1-50 |
| గుడ్డిలోకం | 1-50 |
| మనదేరాజ్యం | 1-50 |

జైహింద్ – ప్రజా యుద్ధం - కళాకార్ (నాటికలు) 1-50
విశ్రాంతి 1-50

# దృ శ్య కా వ్య ధు రీ ణ

# భమిడిపాటి రాధాకృష్ణగారి రచనలు

## అన్ని పరిషత్తులలోనూ ఉత్తమ రచనకు, ఉత్తమ నటనకు, అనేక పర్యాయములు బహుమతిపొందిన నాటక నాటికలు

శైవశాసనం (1962 సం॥లో ఆంధ్రనాటక కళాపరిషత్తులో ఉత్తమ రచన) 2-00
భజంత్రీలు, మన స్తత్వాలు (నాటికలు) 1-50
కీర్తిశేషులు (నాటకం) 1-50
దంతవేదాంతం, అంతా యింతే (నాటికలు) 1-50
పెళ్లిపందాలు, పేటెంటుమందు ,, 1-50
ఇదేమిటి? (నాటకం) 1-50

# ప్రఖ్యా శ్రీరామమూర్తిగారి రచనలు

మనిషిలో మనిషి (1963 ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలలో ఉత్తమ ద్వితీయ ప్రదర్శనకూ ఉత్తమ నటునకూ బహుమతిపొందిన నాటకం) 1-50
ఫణి (లలిత కళానికేతన్ పోటీలలో ఉత్తమనటునికి, ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ నటికి బహుమతి పొందినది) 1-50
ముళ్ళగులాబి 1-50
కాళరాత్రి (ఆంధ్రనాటక కళా పరిషత్తులో ఉత్తమ నటునికి బహుమతి పొందినది) 1-50
వెయ్యం, జనవరి 30 (నాటికలు) 1-50
(లలిత కళానికేతన్ పోటీలలో ఉత్తమనటునికీ, ఉత్తమ ద్వితీయ నటునకూ బహుమతి పొందినది వెయ్యం నాటిక)

వచన రచనలో సిద్ధహస్తులైన

## శ్రీ పురిపండ అప్పలస్వామిగారి

# రామాయణం-వచనం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | బాలకాండ | 2-25 | 5. | సుందరకాండ | 2-75 |
| 2. | అయోధ్యాకాండ | 5-00 | 6. | యుద్ధకాండ | 5-00 |
| 3. | అరణ్యకాండ | 2-75 | 7. | ఉత్తరకాండ | 3-50 |
| 4. | కిష్కింధాకాండ | 2-75 | | | |

పూర్తి సెట్టు వెల 24-00

# శ్రీ మహాభారతము
# వచనము

## శ్రీమంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు – 16 సంపుటములు

| | | | |
|---|---|---|---|
| ఆదిపర్వము | 4-50 | శల్యపర్వము | 2-00 |
| సభాపర్వము | 1-25 | సౌప్తికపర్వము | 0-75 |
| అరణ్యపర్వము 1వ భా॥ | 3-50 | స్త్రీపర్వము | 0-75 |
| డిటో 2వ భా॥ | 3-00 | శాంతిపర్వము | 5-00 |
| విరాటపర్వము | 3-00 | అనుశాసనికపర్వము | 4-00 |
| ఉద్యోగపర్వము | 3-00 | అశ్వమేధపర్వము | 1-50 |
| భీష్మపర్వము | 4-00 | ఆశ్రమవాస, మౌసల, మహా | – |
| ద్రోణపర్వము | 4-00 | ప్రస్థానిక, స్వర్గారోహణ | |
| కర్ణపర్వము | 2-50 | పర్వములు | 1-50 |

పూర్తి సెట్టు వెల రు 44-25



డా॥ కొర్రపాటి గంగాధరరావు L. I. M.

జననం 10–5–1922. జన్మస్థలం మచిలీపట్టణం. విద్యాభ్యాసం ఏలూరు, మద్రాసులలో బాపట్లలో వైద్యవృత్తిలో స్థిరనివాసము. తల్లి కీ. శే. లక్ష్మీనరసమ్మ. తండ్రి వేంకట క్రిష్ణయ్యగారు.

చిన్నప్పటినుంచి నాటకాలలో సరదా. నాల్గవ ఫారం చదువుతుండగా పద్నాల్గవఏట మొదటిసారి "హతవిధి" అనే నాటకం రచించి తయారుచేసి స్టేజి మీద ఆడేరు. ఇప్పటికి నాటకాలు వ్రాయడం వేయడం కొరకే. అభిమాన రచయిత "ఇబ్సన్"–'ఇప్పటివరకు నేను సాధించగలిగినది. తేలికగా ప్రదర్శించడానికి నాటకాలు వ్రాయడమే' అని వీరంటారు. చాలా నాటకాలు, నాటికలు వ్రాశారు. ఇంకా వ్రాస్తున్నారు.

